సంపాదకీయం

# కాశ్మీరు సమస్య

ప్రకృతి సౌందర్యాలతో విరాజిల్లుతూ, దేశ, విదేశీ పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తూ, కవులకు కావ్యవస్తువై, గాయకులు తన్మయత్వంతో గానం చేయడానికి స్ఫూర్తినిస్తూ, చలన చిత్ర నిర్మాతలకు ఆటపట్టు అయిన "సుందర కాశ్మీరం" నేడు తీవ్రవాదుల కార్యకలాపాలకు ఆలవాలమై అక్కడ భీకర భయంకర వాతావరణం నెలకొనటం నిజంగా దురదృష్టకరం. ఈ దుస్థితి అక్కడ ఏర్పడటానికి కారణం కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు లోగడ అనుసరించిన అనాలోచిత చర్యల ఫలితమే. దశాబ్దాల దుష్పరిపాలన ఫలితమే. దూరదృష్టితో శాశ్వతమైన పరిష్కారానికి ఆనాడే పూనుకోకుండా, అక్కడి నాయకులను ఏదో విధంగా సంతృప్తి పరచాలనే ధ్యేయంతో, ఎప్పటికప్పుడు తాత్కాలిక నిర్ణయాలను గైకొంటూ రావటం వలన ఈనాడు కాశ్మీరు సమస్య ఇంత జటిలంగా తయారైంది. తత్ఫలితమే ఈనాడు జమ్మూ - కాశ్మీరు ముఖ్యమంత్రి ఫరూఖ్ అబ్దుల్లా 'అటానమీ' నినాదం. జమ్మూ-కాశ్మీరుకు 1953వ సం॥ ముందునాటి హోదాను కల్పించాలని కోరుతూ, అక్కడి శాసనసభ తీర్మానించడం, రాష్ట్రాలకు ఇంకా స్వయం ప్రతిపత్తి కావాలని కోరటంలో తప్పులేదు. భారత రాజ్యాంగానికి లోబడి, కొన్ని ప్రత్యేక హక్కులు రాష్ట్రాలకు కావాలని "డిమాండ్" చేయటం పొరపాటు కాదు. 1953వ సం॥ ముందు నాటి పరిస్థితులను పునరుద్ధరించాలని కోరటమే పెద్ద పొరపాటు. అందువలననే కేంద్ర మంత్రివర్గం నేషనల్ కాన్ఫరెన్సు 'అటానమీ' తీర్మానాన్ని ఏకగ్రీవంగా తోసిపుచ్చింది. అభినందనలు.

అసలు 1953వ సం॥ ముందు నాటి పరిస్థితి అంటే ఏమిటి? రక్షణ, విదేశాంగ, కమ్యూనికేషనుల రంగాలు తప్ప మిగిలిన అన్ని అంశాలపై జమ్మూ-కాశ్మీర్ ప్రభుత్వానికి ప్రత్యేక అధికారాలుంటాయి. అక్కడి ముఖ్యమంత్రి 'ప్రధాన మంత్రి'"గాను, అక్కడి గవర్నరు "రాష్ట్రపతి" గాను వ్యవహరిస్తారు. 1952 సం॥ వరకు ఆ రాష్ట్ర ముఖ్యమంత్రిని "వజీర్ - ఇ - ఆజమ్' (ప్రధానమంత్రి) అని, గవర్నరును 'సదర్ - ఇ - రియాసత్' (రాష్ట్రపతి) అని పిలిచేవారు. జమ్మూ-కాశ్మీర్, భారత్‌లో అంతర్భాగం అయినప్పుడు, ఒకే దేశంలో ఇద్దరు ప్రధానమంత్రులు, ఇద్దరు రాష్ట్రపతులు ఉండవచ్చునా? కాశ్మీర్ గవర్నరును కాశ్మీర్ శాసనసభ ఎన్నుకుంటుంది. కేంద్ర ప్రభుత్వం నియమించడానికి అవకాశం ఉండదు. కాశ్మీర్ పైన సుప్రీంకోర్టు తీర్పుల ప్రభావం ఉండదు. ఎన్నికల సంఘం పాత్ర, ఆడిటర్ జనరల్ పాత్ర అసలు ఉండనే ఉండదు. భారత రాష్ట్రపతికి ఉన్న ఎమర్జన్సీ అధికారాలు జమ్మూ-కాశ్మీర్‌పై ఉపయోగించడానికి వీలుండదు. ఇటువంటి ప్రత్యేక ప్రతిపత్తిని ఫరూక్ అబ్దుల్లా నేడు కోరటం సమంజసమా? ఇన్ని ప్రత్యేక అధికారాలు ఒక రాష్ట్రానికి సంక్రమించినప్పుడు ఆ రాష్ట్రం భారత్‌లో ఏవిధంగా అంతర్భాగం అవుతుంది? ఇటువంటి ప్రత్యేక ప్రతిపత్తి ఉండకూడదని, దేశభద్రతకు ప్రమాదమని భావించి ఆనాడే లోక్‌సభలో ప్రతిపక్షనాయకుడు డా॥ శ్యామ్‌ప్రసాద్ ముఖర్జీ నేతృత్వంలో బ్రహ్మాండమైన ఉద్యమం జరిగింది. సత్యాగ్రహం చేసి ఆయన కాశ్మీర్ జైలుకు వెళ్ళారు. ఆ జైలులోనే ఆయన కన్ను మూశారు. ఆయన ఏవిధంగా మరణించింది, ఈనాటికి వాస్తవం తేలని ఒక అంతుబట్టని రహస్యం. ఆనాడే ముఖర్జీ మరణాన్ని అది ఒక 'Medico Political Murder' గా రాజకీయ పండితులు అభివర్ణించారు. ఈనాటి ఫరూఖ్ అబ్దుల్లా గారి తండ్రి, షేక్ అబ్దుల్లా ఆనాడు అధికారంలో ఉన్నారు. ఆ తరువాత జమ్మూ-కాశ్మీర్‌ను స్వతంత్ర్య దేశంగా అవతరించడానికి కుట్ర చేస్తున్నారనే అనుమానంతో 1953 ఆగష్టులో షేక్ అబ్దుల్లాను పదవినుంచి తొలగించి అరెస్టు చేయటం జరిగింది. క్రమక్రమేణా అనేక ఒప్పందాల ద్వారా అక్కడ రాష్ట్రపతి, ప్రధానమంత్రి పదవులు రద్దయినాయి. జమ్మూ-కాశ్మీర్, భారత్‌లో అంతర్భాగమైంది. 1971సం॥లో పాకిస్థాన్ నుండి బంగ్లాదేశ్ వేరుపడింది. 1975వ సం॥లో "ఇందిరా-షేక్" ఒప్పందం జరిగింది. ఆ ఒప్పందం ప్రకారం 370వ అధికరణ ప్రకారం, భారతరాజ్యాంగ పరిధిలో జమ్మూ-కాశ్మీర్‌కు ప్రత్యేక ప్రతిపత్తిని పరిరక్షించాలని అంగీకరించడం జరిగింది. 1975వ సం॥లో తిరిగి షేక్ అబ్దుల్లా ముఖ్యమంత్రి అయ్యారు. 1982వ సం॥లో షేక్ అబ్దుల్లా మరణం తరువాత, ఆయన కుమారుడు ఫరూఖ్ అబ్దుల్లా ముఖ్యమంత్రి అయ్యారు. ఆయన ఇప్పుడు 1953వ సం॥ ముందునాటి పరిస్థితి జమ్మూ-కాశ్మీర్‌లో పునరావృత్తం కావాలంటున్నారు. ఇదే ఈనాటి ఫరూఖ్ గారి కాశ్మీర్ 'అటానమీ' సమస్య. రాష్ట్రాలకు మరికొన్ని అధికారాలు కావాలని కోరటంలో తప్పులేదు. కానీ 1953వ సం॥ ముందునాటి పరిస్థితి పునరావృత్తం కావాలని కోరటం అత్యంత ప్రమాదకరమైన విషయం. ఈనాడు సరిహద్దులలో పాకిస్థాన్ పొంచి కూర్చున్నది. ఇటువంటి ప్రమాదకరమైన పరిస్థితులలో ఫరూఖ్ గారి ఆలోచనలను ప్రోత్సహించటం ఏమాత్రం సమాంజసం కాదు! ప్రమాదం కూడాను.

కనుక దేశంలోని రాజకీయ పక్షములు, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాధినేతలు ఈ విషయమును సునిశితంగా పరిశీలించి, ఎట్టి బావోద్రేకాలకు లోనుకాకుండా, ప్రధానంగా దేశభద్రతను దృష్టిలో పెట్టుకొని సముచితమైన రీతిలో నిర్ణయాలు గైకొంటారని ఆశిద్దాం.

మచిలీపట్నం
28-7-2000

(కొమరగిరి కృష్ణమోహనరావు)

ఆగష్టు 2000
సంపుటి 16 సంచిక 8

# శ్రీవాణి
## సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకులు : కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్
**కొమరగిరి చంద్రశేఖర్**
24-52, రామానాయుడుపేట,
మచిలీపట్నం - 521 001.
✆ 22818, 21137

Cheques & Drafts should be drawn in favour of ***"SREEVANI"*** Monthly Machilipatnam

Edited, Printed and Published by
***Komaragiri Krishna Mohan Rao***

| | | |
|---|---|---|
| సాధారణ సంచిక | : | 5-00 |
| సంవత్సర చందా | : | 60-00 |
| 4సం॥ల చందా | : | 225-00 |
| జీవిత సభ్యత్వం | : | 600-00 |
| పోషకులు | : | 1,116-00 |
| రాజపోషకులు | : | 5,116-00 |
| మహారాజపోషకులు | : | 10,116-00 |
| ఓవర్‌సీస్ చందా (4 సం॥లకు) | : | 50 $ |

*Printed at*
**SREEVANI OFFSET PRINTERS**
MACHILIPATNAM

*Despatched on*
**7-08-2000**

## విషయసూచిక



ముఖచిత్రం
జాతీయ కవి **శ్రీ గరిమెళ్ళ కృష్ణమూర్తి**

# జాతీయ కవి శ్రీ గరిమెళ్ళ

స్వాతంత్ర్య సమరం ముమ్మరంగా సాగుతున్న రోజుల్లో తెలుగునాట ఖద్దరు వస్త్రధారులైన కాంగ్రెసు స్వచ్ఛంద సేవకులు మువ్వన్నె జెండాను ఎగురవేసుకుంటూ ముక్తకంఠంతో 'మా కొద్దీ తెల్ల దొరతనం, సైతాను ప్రభుత' "అన్యాయకాలంబు దాపురించిందిపుడు" మొదలైన గీతాలు పాడుతూ ఉండేవారు. ఆ గీత రచయిత శ్రీ గరిమెళ్ళ.

"పన్నెండు దేశాలు పండుచున్నాగానీ
పట్టెడన్నమె లోపమండీ
ఉప్పుముట్టుకుంటే దోషమండీ
నోటమట్టి కొట్టి పోతాడండీ
అయ్యో! కుక్కలతో పోరాడి
కూడు తింటామండీ!
గాంధీ టోపీ పెట్టి పాఠశాలకు బోవ
రావద్దు రావద్దంటాడు
రాట్నం బడిలోపెట్టవద్దంటాడు
టోపీ తీసి వీపుల బాదుతాడు
వాడి రాజద్రోహమంత రాట్నములో ఉన్నదట!

1915వ సంవత్సరంలో స్వదేశానికి తిరిగి వచ్చాక సబర్మతీ ఆశ్రమాన్ని స్థాపించి, గాంధీజీ ఒకసారి జాతీయ గీతాల కవుల సమావేశాన్ని నిర్వహించారు. ఆహ్వానితుల్లో గరిమెళ్ళ కూడా ఒకరు. వచ్చిన కవులు తమ గీతాల్ని వరుసగా వినిపించసాగారు. గరిమెళ్ళ తన వంతు వచ్చాక "మా కొద్దీ తెల్ల దొరతనం" అంటూ పై గీతాలన్ని ఆలపించి దానికి బహుమతి ఒక సంవత్సరం జైలు శిక్ష అని చెప్పారు. గాంధీజీ ఆ పాటను విని ఆశ్చర్యచకితులై అదే బాణీలో పాటలు వ్రాయమని మిగతా కవులకు సలహా ఇచ్చారట.

"మానవజన్మంబెత్తినావు, మనిషి రక్తం త్రాగకురో, పొరుగువాని మాంసంతింటే, పొట్ట పగిలిపోతుంది" అంటూ ప్రబోధించిన జాతీయకవి శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణ. శ్రీకాకుళం జిల్లా నరసన్నపేట తాలూకా గోనెపాడు గ్రామంలో 1893లో జన్మించారు. తల్లి సూరమ్మ, తండ్రి వెంకట నరసింహం. వ్యవసాయం మీద ఆధారపడిన కుటుంబం వారిది. పైగా పెద్ద కుటుంబం ఎనిమిది మంది సంతానం. అయిదుగురు కుమారులు. ముగ్గురు కుమార్తెలు. అందరిలోనూ పెద్దవాడు శ్రీ సత్యనారాయణ గారు. ప్రాథమిక విద్య స్వగ్రామంలోనే జరిగింది ఉన్నత విద్యాభ్యాసానికి విజయ నగరం వెళ్ళాక గరిమెళ్ళ వారిలోని దేశభక్తి పురులు విప్పసాగింది. అప్పుడే ఈ "మా కొద్దీ తెల్ల దొరతనం" కవిత జానపద బాణీలో ఆవిర్భవించింది. ఎందుచేతనో విజయనగరం కళాశాలను వదలి శ్రీ గరిమెళ్ళ

## డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు

మచిలీపట్నం వచ్చి నోబుల్ కళాశాలలో బి.ఏ.లో చేరి అక్కడే డిగ్రీని తీసుకున్నారు. ఆతర్వాత విజయనగరంలోని ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయునిగా కొన్నాళ్ళు, గంజాం జిల్లా కలెక్టరుగారి కార్యాలయంలో గుమాస్తాగా కొన్నాళ్ళు ఉద్యోగం చేశారు కానీ ఆ ఉద్యోగాలు ఆయనకు తృప్తి కల్గించలేదు. అందువల్ల కొంతకాలం స్వగ్రామంలోని జ్ఞానోదయ సమాజ గ్రంథాలయానికి కార్యదర్శిగా పని చేశారు.

1907లో బిపిన్ చంద్రపాల్ దక్షిణ భారతదేశంలో విస్తృతంగా పర్యటించారు. ఆంధ్రప్రదేశ్‌లో విజయనగరం, రాజమహేంద్రవరం మొదలైన పట్టణాలలో ఉపన్యసించారు. ఆ సమయంలో ఆయన ప్రసంగం విన్న శ్రీ గరిమెళ్ళ తీవ్రంగా స్పందించారు. 1920లో ప్రభుత్వ ట్రయినింగ్ కళాశాలలో ఎల్.టి. కోర్సు చదువుదామని రాజమహేంద్రవరం వెళ్ళిన శ్రీ గరిమెళ్ళ అక్కడ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం గారి వంటి దేశభక్తుల వల్ల మరింత ప్రభావితులయ్యారు. గాంధీజీ గారు ప్రవేశపెట్టిన త్రివిధ బహిష్కారానికి - అంటే ఇంగ్లీషు పాఠశాలల, న్యాయస్థానాల, శాసనసభల బహిష్కారం - స్పందించి తాను చదివే చదువుకు స్వస్తి చెప్పారు. 1921లో వేల్స్ యువరాజు భారతదేశపర్యటనకు వచ్చినపుడు దేశభక్తులు నిరసన ప్రదర్శనలు జరిపారు. అనేకమంది ప్రదర్శకులు తుపాకిగుండ్లకు ఆహుతులయ్యారు. ఆ సమయంలో

"ఏమయ్యో, యువరాజా! ఎందుకొచ్చావయ్యా!" అంటూ వ్రాసిన గరిమెళ్ళ వారి గీతం ఆంధ్రదేశంలో ప్రతి నోటా వినపడింది. 1922 వ సంవత్సరంలో రాజమహేంద్ర వరం కలెక్టరుగా పనిచేస్తున్న జి.టి.హెచ్ బ్రేకన్ గరిమెళ్ళను పిలిపించి తన సముఖంలో ఆ గీతాన్ని పాడమన్నాడు. గరిమెళ్ళ తన కంచుకంఠమెత్తి 'మా కొద్దీ తెల్లదొరతనం' పాటపాడాడు. వెంటనే కలెక్టర్ 124 ఏ సెడిషన్ చట్టం క్రింద గరిమెళ్ళ వారిని అరెస్టు చేయించి కాకినాడ పంపారు. అక్కడి జిల్లా మేజిస్ట్రేటు ఆయనకు ఒక సంవత్సరం కఠిన కారాగార వాస శిక్షను విధించి కడలూరు జైలుకు పంపారు. ఆ శిక్షను అనుభవిస్తూనే గరిమెళ్ళ "దండాలండోయ్, మేముండలే మండోయ్ బాబూ ఈ సైతాను ప్రభుతసాగ నీయమండోయ్ బాబూ!" అంటూ 113 చరణాల దీర్ఘగీతాన్ని వ్రాశారు. దీనితో గరిమెళ్ళ మీద రాజద్రోహ నేరం మోపబడింది విచారణ తర్వాత గరిమెళ్ళకు రెండేండ్ల శిక్ష విధించారు. మొదట విధించబడిన శిక్షను, ఈ శిక్షను ఆయన ఏకకాలం లో అనుభవించారు. మధ్యలో విడుదల కాలేదు ఆ మధ్య కాలంలో ఆయన గళం నుండి వెలువడిన "కూలిపోతున్నది కూలిపోతున్నది కూల మట్టముతోటి, కూలిపోతున్నది ప్రభుత్వం, కూకటివేళ్ళలో కూలిపోతున్నది పర ప్రభుత్వం' అనే అద్భుతగీతాన్ని ఆంధ్రులు మరువలేరు.

1923జనవరిలో గరిమెళ్ళ వారి జనకులు వెంకట నరసింహంగారు పరమపదించారు. క్షమాపణ పత్రం ఇస్తే పెరోల్ మీద వెళ్ళవచ్చునని జైలు అధికారులు తెలియ జేశారు. అందుకు గరిమెళ్ళ అంగీకరించలేదు. తత్ఫలితంగా వ్యేష్ఠుడై కూడా గరిమెళ్ళ కన్నతండ్రి అంత్యక్రియలను నిర్వహించ లేకపోయారు జైలునుండి విడుదలయ్యాక గరిమెళ్ళ స్వగ్రామానికి తరలివచ్చారు. అప్పటికే కుటుంబ పరిస్థితులు తారుమారయినాయి. అప్పులు పెరిగినాయి. భూములు తరిగినాయి. సహధర్మ చారిణి కూడా కాలధర్మం చెందారు. ఆ పరిస్థితుల్లో 1933లో ఆయన మదరాసు చేరుకున్నారు. మైలాపూర్‌లో ఉండేవారు. అప్పటికే ఆయన మరో వివాహం చేసుకున్నారు. ఇద్దరు కుమార్తెలు కల్గారు. ముదుసలి తల్లిని, తమ్ముడు రామ లింగమూర్తిని కూడా తనతో మదరాసు తీసుకు వచ్చారు. అక్కడ ఆచార్య రంగాగారి "వాహిని" లో కొన్నాళ్ళు, "ఆంధ్రప్రభ" దినపత్రిక కార్యాలయంలో కొన్నాళ్ళు సహాయ సంపాదకునిగా పనిచేశారు. కొన్నాళ్ళు "ఆనందవాణి" పత్రికకు సంపాదకునిగా కూడా పనిచేశారు. వావిళ్ళ వారి "త్రిలింగ"లో దుందుభి, వికారి అనే కలం పేర్లతో ఎన్నో రాజకీయ వ్యాసాలు వ్రాశారు. భారతి, కృష్ణా పత్రిక వంటి ఉత్తమ పత్రికల్లో ఎన్నో సాహిత్య వ్యాసాలు వ్రాశారు.

తర్వాత తమ్ముడు రామలింగమూర్తితో కలిసి మైలాపూర్‌లో "కల్పక విలాస" అనే భోజన హోటలు నడిపారు. అయితే ఆ హోటలు దివాలా తీసింది. అద్దె బకాయికి గాను, హోటల్ లోని సామాన్లను బయటకు విసిరేసినప్పుడు గరిమెళ్ళ పడిన మానసిక క్షోభ అంతా ఇంతా కాదు 1942లో ఆయనకి కంటి జబ్బు మొదలయింది. 1944లో ఆయన సోదరుడు, 1946లో ఆయన భార్య కాలధర్మం చేశారు. 1951లో ఆయన తల్లి మరణించింది. పక్షవాతం ఆయన్ను బాధించసాగింది.

1951లో ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు స్వామి సీతారాం అంటే గొల్లపూడి సీతారామశాస్త్రి. స్వరాష్ట్రం కోసం నిరశన వ్రతం ప్రారంభించారు. 38

## కల్లోలం కాదు, కార్యాచరణ

"విప్లవాలతో మనం ఎట్టి కార్యమును సాధించ లేము. ఈనాడు కావల్సింది కల్లోలం కాదు, కార్యాచరణ. కల్లోలమునకు దారితీయక, కార్యమును సాధించడానికి ప్రయత్నించాలి. శాంతముతో శాశ్వత లాభమును పొందుతాం. సమాజమునకు నష్టం కలుగజేయటం అంటే, తనకు తాను నష్టం కలుగజేసికోవటమే. వ్రేళ్ళు మనవి, కన్నులు మనవి. ఏ వ్రేలుతో పొడుచుకున్నా మన కన్నులకే ముప్పు. ఏదో కంపెనీ అని, ప్రభుత్వ ఆస్తిఅని, మనది కాదనే భావంతో విధ్వంసానికి పూనుకుంటున్నారు కొందరు. నిజానికి అది అంతా మనదే. దానికి నష్టం కలిగితే మనకు నష్టం కలిగినట్లే, కనుక ప్రేమతో జీవించి, ప్రేమతో కార్యం చేసి, ప్రేమతో అన్యోన్య అనురాగములు పెంచుకొని, మానవత్వాన్ని అభివృద్ధి పరచుకోవాలి. ప్రేమతో మానవత్వం, దైవత్వముగా మారిపోతుంది. ప్రేమ ఉన్నచోట ద్వేషమునకు అవకాశమే ఉండదు."

- బాబా

రోజుల తర్వాత ఆచార్య వినోబాభావే కోరిక మేరకు ఆయన ఆ వ్రతాన్ని విరమించారు. ఆ సందర్భంగా గరిమెళ్ళ "బహుభాషా ప్రయుక్త రాష్ట్రాల ఆవశ్యకత అనే వ్యాసాన్ని వ్రాశారు: అది 'కిన్నెర' అనే పత్రికలో ప్రచురితమయ్యింది. ఆ తర్వాత మైలాపూర్‌లో బులుసు సాంబమూర్తిగారి బసలో పొట్టి శ్రీరాములు గారు ప్రయోపవేశం చేసి 58 రోజుల తర్వాత 1952, డిసెంబరు 15న అమరజీవులయ్యారు. ఆరోజు నుండి సరిగ్గా మూడవ రోజున అంటే డిసెంబరు 18వ తేదీన ఉదయం పన్నెండు గంటలకు గరిమెళ్ళ వారు కూడా దివంగతులయ్యారు.

మహాత్ముని సిద్ధాంతాలను త్రికరణ శుద్ధిగా విశ్వసించడమే గాక వాటిని ఆచరణలో పెట్టిన నిజాయితీ పరుడు గరిమెళ్ళ. గాంధీజీ వలె ఆయన కూడా కత్తి బలాన్ని నిరసించారు. ప్రేమతోనే శత్రువుని గెలవాలని విశ్వసించారు. ప్రజాస్వామ్యవ్యవస్థలో ఓటుకున్న ప్రాధాన్యాన్ని గుర్తెరిగిన గరిమెళ్ళ "వోటుల కొరకై మూటలు పట్టుకు బాటను నిలిచేరు, పాటక జనముల స్వేచ్ఛాభావము భంగము పరిచేరూ" అని హెచ్చరించారు. పర ప్రభుత్వానికి బానిసలై సంచరించే కుహనా ప్రజాప్రతినిధులను ఊహాపోహపడుతూ, "ప్రజలకు మేమే ప్రతినిధులమని బడాయి చెప్తారు. ప్రభువుల వెనుకను తోకలు త్రిప్పుచూ పండ్లికిలించారు" అని ఎద్దేవా చేశారు.

గరిమెళ్ళవారు. తమిళ వేదమైన 'తిరుక్కురళ్' ను "అర్థత్రయ సర్వస్వంగా" తెలుగు సేత చేశారు. "నాలడి యార్" అనే తమిళ నీతి గ్రంధాన్ని కూడా తెలుగులోనికి అనువదించారు. భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు ఆంగ్లంలో వ్రాసిన The economic conquest of India ను "భరతఖండము పైని ఆర్థిక విజయము" అనే పేరుతో తెలుగు లోకి అనువదించారు. "నీ వొక్కడి లాభం సూసుకోక యెల్లరిబాగు చూడరో, దేశంబల్లా వృద్ధికి వచ్చే తేట మార్గం చూడరో" అని ఎలుగెత్తి చాటిన గరిమెళ్ళను ప్రస్తుతించటం, చంద్రునికో నూలుపోగు సమర్పించటం వంటిది. ప్రతి తెలుగువాడు గుర్తుంచుకొని గర్వించదగ్గ మహనీయుడు శ్రీ గరిమెళ్ళ. అందుకే ఆయనకు ఈ నీరాజనాలు.

**నీతికథలు - 7**

## బ్రాహ్మణి నువ్వులు

పూర్వం ఒక బ్రాహ్మణుడు వుండేవాడు. అతడు ఒకనాడు తన భార్యను చూసి, "రేపు అమావాస్య బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి. భోజనానికి ఏయే పదార్థాలు కూర్చిపెట్టావు?" అని అడిగాడు. అందుకు బ్రాహ్మణి ఇలా అనింది. "మగవాళ్ళు పదార్థాలు సేకరించి ఇంటికి తెస్తే వాటివి ఆడవాళ్ళు కావాల్సిన రీతిగా వండుతారు. కాని మీరు తేకుంటే పదార్థాలెక్కడ నుంచి వస్తాయి?" అనగా విని విప్రుడు కోపం చేసుకొని ఇల్లాల్ని చూసి "ఉన్నంతలో జరుపుకోవాలి, కాని విస్తారంగా పదార్థాలు సమకూర్చుకోవాలని పూరక ఆశపడకూడదు" అని మందలించాడు. అంత బ్రాహ్మణి "అలాగే కానివ్వండి, రేపటికార్యం కలిగినంతలోనే జరుపుతాను." అని చెప్పి ఆయమ్మ నువ్వులు కడిగి, దంచి, యెండబోసింది.

అంతట ఒక కోడి ఆ నువ్వులను కాళ్ళతో కెలికి చిందర వందర చేసింది. అది బాపడు చూసి "ఈ నువ్వులు అంటుపడ్డాయి. బ్రాహ్మణ భోజనానికి పనికిరావు కాబట్టి వీటిని తీసుకొని పోయి మార్చుకొనిరా" అని చెప్పాడు. అంతనా బ్రాహ్మణి పొరుగింటికి పోయి, "ఈ నువ్వుపప్పు తీసుకొని నువ్వులిస్తావా?" అని ఆ యింటి యిల్లాలి నడిగింది. ఆ మాట విని, ఆ యింటావిడ చాలా సంతోషించి చేటలో నువ్వులు పోసుకొచ్చి మాటాడుతూ వుండింది.

ఇంతలో ఆమె భర్తవచ్చి "ఏమిటి, బేరమాడు తున్నావు?" అని అడిగాడు. "ముడినువ్వులిచ్చి దంచిన నువ్వులు తీసుకొంటున్నాను" అని ఆవిడ చెప్పింది. ఆ మాటలువిని బ్రాహ్మణుడు "ఓసీ, వెఱ్ఱిదానా! ముడి నువ్వులకు దంచిన నువ్వులెవ్వరైనా యిస్తారా? ఈమె యీ విధంగా తెచ్చియివ్వడానికి ఏమైన కారణముంటుంది. కాబట్టి నీవా నువ్వులు తీసుకోవద్దు" అన్నాడు భర్త మాట లాలకించు ఆ యిల్లాలు నువ్వులివ్వలేదు.

నీతి : కారణం లేకుండ ఏకార్యమును జరగదు.

ఎం. మునికృష్ణారెడ్డి



# శనివారం-కలియుగదైవం



"కౌసల్యా సుప్రజారామా పూర్వా సంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్
ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద ఉత్తిష్ఠ గరుడధ్వజ
ఉత్తిష్ఠ కమలాకాన్త త్రైలోక్యం మంగళంకురు"

తెల్లవారు ఝామున ప్రతిరోజూ మనందరికీ వీనుల విందుగా వినిపించే సుమధురమైన సుపరిచితమైన సుప్రభాత శ్లోకం ఇది. ఇది వినని తెలుగు వారు ఉండరు అంటే అది అతిశయోక్తి కాదేమో. దీనిని వింటూ దానితో తామూ శృతి కలిపి పాడుకుంటూ పనులలో ప్రవేశిస్తే మరొక పదినిముషాలకు

"లక్ష్మీనివాసనిరవద్యగుణైకసింధో
సంసార సాగర సముత్తరణైకసేతో
వేదాంతవేద్య నిజవైభవ భక్త భోగ్య
శ్రీ వేంకటా చలపతే తవసుప్రభాతమ్"

మొదటి శ్లోకంలో మేలుకో! మమ్మేలుకోమని. త్రేతాయుగంలో ఆనాటి అవతార పురుషుడు కౌసల్యా నందనుని మేలుకొలిపి, చివరి శ్లోకంలో, లక్ష్మీనివాస వేదాంత వేద్య కలియుగ అవతార శ్రీ వేంకటేశ! మమ్ము లను ఈ సంసారసాగరమునుండి దాటించ మేలుకోవయ్యా! దయతలచి మమ్మేలుకోవయ్యా! అని వేడుకుంటాము. కలియుగ ప్రత్యక్షదైవమయిన శ్రీ వేంకటేశ్వరునికి శనివారం చాలా ప్రీతికరమైన రోజు. ఆ రోజు రేడియోలో తప్పని సరిగా శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం, స్తోత్రము, ప్రపత్తి, మంగళాశాసనము వస్తుంది. సుప్రభాతం అనగా మంచి ఉదయం. దైవమును మేలుకొలపాలని తెల్లవారుఝామునే లేచి పాటలతోను పద్యములతోను, శ్లోకములతోను భగవంతుని స్తుతిస్తారు నిజానికి దైవము నకు రాత్రి పగలు లేవు. ఆకలిదప్పులు లేవు. కానీ తాను సృష్టించిన జీవులు సక్రమమైన మార్గంలో నడవాలంటే వారు చేయవలసిన పనులు తాను ఆచరించినట్లు నటిస్తుంటాడు. అందుకే నటన సూత్రధారి మాయామానుష వేషధారి అన్నారు స్వామిని. అది దైవలీల దైవము మనకు నిర్ణయించిన పనులను సక్రమముగా చేయటమే మన ధర్మం. శనివారం అనగానే దుర్ముహూర్తం ఉంటుందని శని అనగానే ఏదో అశుభమైన రోజని అనుకోకూడదు. శనివారం ఏడుకొండలవాడికి ఎంతో ఇష్టమయిన రోజు. కొంతమంది వారు అనుకున్నవి జరిగే వరకు ఏడు వారములు, లేక, ఐదు, మూడు, వారములు అనుకొని శనివారంనాడు శ్రీ వేంకటేశ్వరుని పూజించి పగలు ఏమీ తినకుండా రాత్రి పూట కొంచెము ఫలహారము తీసు కొని మరునాడు స్వామిని పూజించి అప్పుడు భోజనం చేస్తారు

కొమరగిరి జయప్రద

మరికొంతమంది 'జన్మశనివారములు' ఉంటారు. అనగా జీవితం ఉన్నంత వరకు శనివారవ్రతము చేస్తారు. జాతిమతకుల బేధములు లేకుండా పూజించే దేవుడు ఏడుకొండలవాడు. ఆపదమ్రొక్కులవాడు వడ్డికాసుల వాడు అనుకున్నది ఇవ్వకపోతే అడిగి మరీ ఇప్పించుకొని దేవుడున్నాడు అనిపిస్తాడు శ్రీవేంకటేశ్వరుడు. జోగిఎత్తి కొండకు వస్తామని, పసుపు బట్టలతో వస్తామని తలనీలాలు ఇస్తామని, హుండీలో ఏమేమో వేస్తామని ఎన్నోరకాల మ్రొక్కులు. ఎవరినమ్మకం వారివి. అడుగడుగు దండాల వాడా! ఆపదమ్రొక్కుల వాడా! వడ్డీకాసులవాడా! గోవిందా! గోవిందా! అని పిలిచిన పలికే ఆ స్వామి నామాలు ప్రతివారి నాలుక మీద నాట్యమాడుతూ ఉంటాయి. ప్రతి వారి చెవుల లోనూ మారుమ్రోగుతూ ఉంటాయి. అందుకే తిరుపతి క్షేత్రం నిత్యకల్యాణం పచ్చతోరణంగా ఉంటుంది. ఒక్క తిరుపతిలోనే కాదు! శ్రీ వేంకటేశ్వరుని గుడిలేని ఊరు లేదు స్వామి భక్తులు లేని ఇల్లులేదు. ఆబాల గోపాలమూ పూజించే దేవుడు శ్రీ వేంకటేశ్వరస్వామి. శ్రీ ఆంజనేయ స్వామికి కూడా శనివారం ఇష్టమయిన రోజే. ఆ స్వామికి నిజమైన దాసుడు గదా! అందువలన అంతేకాక శనివారం శనైశ్వరునికి ప్రీతికై శనిదోష నివారణార్థం నువ్వులనూనెతో అభిషేకము తిలదానము చేస్తే శని గ్రహదోషము ఉండదని కూడ అంటారు. కాబట్టి శనివారమును చెడుగా భావించ రాదు. అందరి ఇష్టదైవము కలియుగ ప్రత్యక్ష దైవము అయిన అలివేలు మంగా సహిత శ్రీ వేంకటేశ్వర స్వామిని పూజించి, సేవించి మనజన్మను సార్థకం చేసుకుందాము.



# తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# శ్రీ వేంకటేశ్వర నిత్యాన్నదాన ట్రస్టు



(రిజిష్టరు నెంబరు 18/94)

**తి.తి. దేవస్థానముల పరిపాలన భవనం, కె.టి.రోడ్డు, తిరుపతి (ఆంధ్రప్రదేశ్)**


**డా॥ ఐ.వి. సుబ్బారావు,** ఐ.ఏ.ఎస్,
కార్యనిర్వాహణాధికారి


**ప్రియమైన దాతలకు,**

అన్నదానం కంటే మించిన దానం మరొకటి లేదు. మనదేశంలో ఆకలిగొన్న వారికి, పేదవారికి అన్నదానం చేయుట మన్నది కేవలం సేవ మాత్రమేకాదు, వేదకాలం నుంచి వస్తున్న పవిత్ర సంప్రదాయం! అన్నదానం చేసిన వారికి దేవతల ప్రక్కన చోటు లభిస్తుందని పెద్దలంటారు.

తిరుమలకు వచ్చే యాత్రికులకు ఉచితంగా చక్కని భోజనాన్ని అందించే ఉద్దేశ్యంతో 1985లో "శ్రీ వేంకటేశ్వర నిత్యాన్నదాన ట్రస్టు" ప్రారంభించినప్పటి నుండి అపూర్వాదరణ చూరగొని దేశమంతటి నుండి సహృదయులైన దాతల నుండి విరాళాలు అందుతున్నాయి.

**ఈ పథకం విశేషాలు :**

**I** ఎవ్వరైనా ఐదు లక్షలు దానికి రెట్టింపు మొత్తం (a)ఒక వ్యక్తి, (b)కుటుంబంలో ఐదుమంది కలిపి, (c)రెండు వ్యాపార సంస్థలు కలిపి, విరాళం ఇవ్వవచ్చు. వీరికి ఈ క్రింది సౌకర్యాలు లభిస్తాయి.

1. దాతల పేర్లు భోజనశాలలో ప్రదర్శిస్తారు.
2 దాతలకు సంవత్సరంలో ఎప్పుడైనా 3 రోజుల పాటు ఉచిత వసతి ఏర్పాటు చేయబడుతుంది
3. దాతలకు సంవత్సరంలో ఎప్పుడైనా 3 రోజులు 5 మందికి మాత్రం వైకుంఠం 'క్యూ' కాంప్లెక్సు ద్వారా దర్శనము.
4. దాతలకు శ్రీ వేంకటేశ్వరస్వామి మరియు శ్రీ పద్మావతి అమ్మవారి వెండి బొమ్మలకు బంగారు పూత పూసిన జ్ఞాపిక బహూకరింపబడుతుంది. (ఒక పర్యాయం మాత్రమే)
5 ఆదాయపు పన్ను చట్టం సెక్షన్ 80 (జి) క్రింద పన్ను మినహాయింపు.

సదరు దాతల విరాళాలను జాతీయ బ్యాంకులలో ఫిక్సెడు డిపాజిట్ల ద్వారా ప్రతి ఏటా వచ్చు వడ్డీతో మాత్రమే అన్నదానానికి ఉపయోగింపబడుతుంది. ప్రస్తుతం ప్రతిదినం 15,000 మందికి ఉచిత భోజన సదుపాయం కలుగజేయబడుతున్నది.

**II** 1,000 రూపాయలు లేదా దానికి ఎన్ని రెట్లు మొత్తాన్నయినా, ఈ శ్రీ ఎస్.వి. నిత్య అన్నదాన పథకమునకు విరాళమిచ్చి అవసరమగువారు ఈ మొత్తానికి కూడ ఆదాయపు పన్ను చట్టం సెక్షన్ 80 (జి) క్రింద పన్ను మినహాయింపు పొందవచ్చును.

**III** 5 లక్షల రూపాయలు ఆ పైన ఇచ్చు దాతలకు ఒక వస్త్రము, 10 చిన్న లడ్లు బహుమానముగా ఇవ్వబడును.

**విరాళాలు పంపే పద్ధతి :**

దాతలు విరాళాలను ఏ జాతీయ బ్యాంకు నుండి అయినా "శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదానం ట్రస్టు, తిరుపతి" పేరు మీద డిమాండు డ్రాఫ్టును తీసి "కార్యనిర్వాహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి (ఆంధ్రప్రదేశ్)" వారికి పంపవలెను. ఇతర వివరాలకు

**కార్య నిర్వాహణాధికారి,**

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తి.తి.దే. పరిపాలన భవనం, తిరుపతి - 517 501.**

**అన్నదానంతో ఆదుకోండి! ఆత్మ సంతృప్తిని పొందండి!!**

# చెడ్డచూపులు చూడకండి! చెడ్డమాటలు వినకండి!!

"పునర్విత్తం పునర్మిత్రం
పునర్పత్నీ పునర్మహీం
ఏతత్సర్వం పునర్లభ్యం
న శరీరం పునః పునః"

ప్రేమ స్వరూపులారా!

మనం ధనమును కోల్పోయిన, తిరిగి ఎన్నియో మార్గముల ద్వారా దానిని మనం సంపాదించవచ్చును. స్నేహితుని కోల్పోయిన, మరెంతో మంది స్నేహితులను సంపాదించవచ్చును. భార్యను కోల్పోయిన, తిరిగి రెండవ వివాహం చేసుకోవచ్చును, భూమిని కోల్పోయిన మరల ఏదో విధంగా ఆ భూమిని సంపాదించుకోవచ్చును. మానవ శరీరమే కోల్పోయిన, తిరిగి అది లభ్యం కాదు. ఎన్ని సాధనలు సలిపిన, ఆ శరీరం తిరిగి మనకు లభ్యంకాదు. కనుక మానవజీవితం చాలా దుర్లభమైనటువంటిది. చాలా పవిత్రమైనటువంటిది. సౌజన్యమైనటువంటిది. సౌశీల్య మైనటువంటిది. కనుక ఇట్టి శరీరమును శ్రమలకోర్చియైనా కాపాడుకోవటం మానవుని కర్తవ్యం. సమస్త సంకల్పములు చేకూర్చుకోవలెనన్నిన శరీరం చాలా అవసరం. దేహమే లేకుండిన ఎట్టి చిన్న కార్యములనైనా సాధించలేము. కనుక ధన కనక వస్తు వాహనాదులకంటే, ఈ శరీరం చాలా విలువై నటువంటిది. కాన ఈ శరీరమును సరియైన మార్గములో అనుభవించి, సరియైన మార్గములో ప్రవేశపెట్టి, దీనిని సార్థకం గావించుకొనవలెను. గడచిన కాలం తిరిగిరాదు. సముద్రంలో కలిసిపోయిన గంగను తిరిగి ఒక్క చుక్కనైనా తెచ్చుకోలేము. బాగా నమిలి మ్రింగిన ఫలమును తిరిగి ఫల రూపములో మనం సాధించలేము. కనుక గడచి పోయిన మానవజీవితమును ఎన్ని ప్రయత్నములు చేసి నప్పటికీ, తిరిగి దానిని పొందలేము. Men are more valuable than all the wealth of the world. ధనమునకు ఎవరు విలువ యిస్తున్నారు? డైమండ్‌కు ఎవరు విలువ యిస్తున్నారు? భూమికి ఎవరు విలువ యిస్తున్నారు? అన్నిటికి విలువ యిచ్చేటటువంటివాడు మానవుడే. మానవుడే లేకుండిన వీటికి విలువ ఎక్కడ పెరుగుతుంది. ఎవరు యివ్వగలరు? కనుకనే "జంతూనాం నరజన్మ దుర్లభమ్" అన్నది వేదం. మానవత్వంలో సాధించవలసినవి ఎన్నియో ఉన్నవి. మానవత్వం కంటే, అతని ప్రాణం చాలా విలువైనది. కాని కొన్ని సమయము లలో ప్రాణం నయినా త్యాగం చేసి, మనం సాధించవలసిన కార్యములను చేయటానికి పూనుకుంటాం.

## భగవాన్ సాయి దివ్యబోధ

ప్రేమస్వరూపులారా! మానవదేహము యొక్క విలువను గుర్తించుకోవటం అత్యావసరం. మానవత్వంలో వున్నటువంటి దివ్యత్వాన్ని కాపాడేటటువంటిది ఈ దేహమే.

**"విలువలేని ఇనుపపెట్టె ఈ దేహంబు
పెట్టిలోన నగలు పెట్టినట్టు
దేహమందు విలువ దేవుడుండెను సుమా!"**

ఈ దేహమునందు సద్గుణములు, సచ్చింతనలు, సదాలోచనలు వంటి విలువైనటువంటి గుణములను ఇందులో దాచుకున్నాం. ఈ విలువైనటువంటి గుణములు కోల్పోతిమా, తిరిగి వీటిని సాధించలేము.. ఈ గుణము వలననే, మానవత్వమునకు విలువ వచ్చింది. దయ, ప్రేమ, సహనం, సానుభూతి, త్యాగం - ఇత్యాది మానవతా గుణములు ఉండటం చేతనే, మానవత్వమునకు గొప్ప విలువ ఏర్పడింది. కాని ఈనాటి మానవుడు, ఈ మానవతా విలువలను ఏమాత్రం అర్థం చేసుకోలేక పోతున్నాడు. ఈ దేహమనే గడియారమందు సంవత్సర మనేటటువంటి గంటల ముల్లు ఉంటున్నది. మాసము లనేటటువంటి నిముషాల ముల్లు ఉంటున్నది. దినముల నేటటువంటి సెకండ్ల ముల్లు కూడా ఉంటున్నది. ఈ మూడు ముండ్లూ చక్కగా తిరుగు తున్నాయి గాని, వీటి యొక్క అవస్థను ఏమాత్రం గుర్తించుకోలేకపోతున్నారు మానవులు. ఎప్పుడు గంట కొట్టినా ఘన్... ఘన్.... అని కొడుతుంది. ఎప్పుడు ఈ దేహమును వీడి పోవుదునో,

ఎవరూ గుర్తించుకొనలేరు. కనుక మనం దీనిని సరియైన మార్గంలో వినియోగించుకోవాలి.

మానవ దీర్ఘ ప్రయాణమునకు దేహము ఒక పనిముట్టు. ఇటువంటి ప్రధానమైనటువంటి పనిముట్టును సక్రమంగా ఉపయోగపెట్టుకొననిచో, మధ్య మార్గంలో అనేక అవస్థలకు గురి కావలసివస్తుంది. కనుక మానవత్వంలో ఉండిన గుణములను కొంత విచారణ చేయాలి. దివ్యత్వ మంటే ఏమిటి? పవిత్రమంటే ఏమిటి? నిమిత్తమంటే ఏమిటి? నిశ్చలమంటే ఏమిటి? నిస్వార్థమంటే ఏమిటి? అనేటటువంటి విషయాలను మనం గుర్తించుకొనలేక పోతున్నాం. కాని ఈనాటి మానవుడు, ఈ విలువైనటు వంటి శరీరమును, స్వార్థ స్వప్రయోజనాలకు వినియోగించు కుంటున్నాడు. కాని భగవంతుడు స్వార్థ స్వప్రయోజనాలకు మాత్రమే ఈ శరీరమును అందించలేదు. "పరోపకారార్థ మిదం శరీరం". నిన్ను నీవు రక్షించుకోవటమే కాదు, నీతోటి మానవులను కూడా రక్షించుకోవటానికి కంకణం కట్టుకోవాలి. పరోపకార నిమిత్తమై ప్రాకులాడినప్పుడే, మన స్వార్థం కూడా అందులో ఒక భాగంగా ఇమిడి ఉంటుంది. కాని ఈనాటి మానవుడు పరోపకారం అంటే ఏమిటో, ఏమీ తెలియని వాడుగా ఉన్నాడు. పదునెనిమిది పురాణముల సారాంశ మంతా రెండు మాటలలో ఇమిడ్చి పెట్టారు. అదే Help Ever Hurt Never. ఇతరులకు సహాయం చేసే నిమిత్తమై భగవంతుడు ఈ దేహమును అందించాడు. కాని ఈ సహాయం అంటే ఏమిటో, ఏమాత్రం అర్థం చేసుకోవటం లేదు. నిరంతరమూ స్వార్థం...స్వార్థం..... స్వార్థం..... ఏ పని చేసినా, ఏ తలంపు తలచినా, ఏ కార్యంలో ప్రవేశించినా అంతా స్వార్థమే. కనుక మానవుడు స్వార్థ స్వప్రయోజనాల చేతులలో ఒక పని ముట్టుగా నిలిచిపోయాడు. ఈ స్వార్థం చేతిలో పనిముట్టుగా నిలిచిన మానవుడు, ఇక స్వాతంత్రుడు ఎలా అవుతాడు. కనుక ఈ స్వార్థమును త్యజించాలి. పరార్థమును వరించాలి. అప్పుడే ఈ శరీరం సార్థకమవుతుంది.

ఒక్క శరీరమునకేగాక, మనోశక్తులకు కూడా ఆనందాన్ని చేకూర్చాలి ఈ దేహములో మూడు పదార్థములు ముఖ్యమైనవి ఉన్నాయి. 1. హృదయం, 2. మనస్సు, 3.వాక్కు. ఆ హృదయమునే వేదములు 'ఆత్మ' అని పిలిచాయి. ఈ ఆత్మ స్వరూపంలో ఉన్నటువంటి వాడే ఈశ్వరుడు. మన మనసే విష్ణు స్వరూపుడు. వాక్కే బ్రహ్మ స్వరూపుడు. కనుకనే బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపమే ఈ మానవత్వం. ఇంత విలువైనటువంటి దైవత్వాన్ని పొందినటువంటి మానవుడు ఈ సత్యమును ఎందుకు గుర్తించుకోవటం లేదో అర్థం కావటం లేదు. తనను తాను గుర్తించుకొనినటువంటివాడే, ఇతరులను గుర్తించగలడు. గనుక మొట్టమొదట 'I' అనేటటువంటి దానిని గుర్తించాలి. అన్నీ మన పదములలోనే ఇమిడి ఉంటున్నాయి. ఒక భక్తుడు వచ్చి "స్వామీ! "I want Peace" అన్నాడు. "ఎందుకు ఇంత అవస్థలకు గురి అవుతున్నావు?" అని అడిగాను. 'I' అంటే 'ఇగో' (Igo), want అంటే కోరిక. కనుక ఇగోను, కోరికను - ఈ రెండింటినీ తీసివేస్తే మిగిలేది peace. ప్రతి దానియందు కొన్ని 'మైనస్' చేయాలి, కొన్ని ప్లస్ చేయాలి. కనుక ఈ ప్లస్, మైనస్‌ల లోనే మన జీవితం అనేక ఒడుదుడుకుల పాలవుతున్నది. కనుక మనం 'I' అనేటటువంటి అహంకారమును త్యజించడానికి ప్రయత్నించాలి. అది చాలా కష్టమని భావిస్తున్నారు. అది చాలా పొరపాటు. 'I' అనేటటువంటి పదాన్ని త్యజించడం చాలా సులభం.

పెట్టిన పేరునే శాశ్వతంగా నిలబెట్టు కుంటున్నాడు. పుట్టిన పేరును విసర్జిస్తున్నాడు. ఇదికాదు. పుట్టిన పేరునే శాశ్వతంగా తీసుకోవాలి. పెట్టిన పేరు ఏనాడైనా మార్పు చెందుతుంది. దేహమున్నంతవరకు మాత్రమే, ఆ పేరు వినియోగమవుతుంది. కాని దేహంతో పాటు పేరు కూడా

పోతుంది. ఎంతకాలం ఈ దేహం? ఎప్పుడో ఒకప్పుడు కూలిపోతుంది. మరణమే నిశ్చయం. మనం తెలుసుకో వలసింది అదే. నేను ఎవరు? "నేను" అనేటటువంటిది దేహము కాదు, మనసు కాదు, బుద్ధికాదు, చిత్తము కాదు, అంతఃకరణ కాదు. "నేను నేనే" ఈ దేహముతోపాటే 'నేను' అనేటటువంటిది ఆవిర్భవిస్తూ వచ్చింది. ఈ దేహమునకు పేరే 'నేను'. కాని ఎన్ని 'నేను'లు ఉన్నాయో! ఒక్క 'నేను' ను నీవు గుర్తించుకుంటే, సర్వ 'నేను'లు నీవు గుర్తించుకోవాలి.

ప్రేమస్వరూపులారా! మానవత్వంలో ఉన్నటువంటి సూక్ష్మమైన వాటిని ఎవరూ గుర్తించడానికి ప్రయత్నించటం లేదు. చాలా రహస్యమైనవి ఉన్నాయి. చాలా విలువైనటువంటివి ఉన్నాయి. ప్రపంచంలో ఎన్ని శక్తులున్నాయో, ఆ సర్వశక్తులన్నీ ఒక్క మానవత్వంలోనే ఇమిడి ఉన్నాయి. మానవునిలో లేని వస్తువు ప్రపంచంలో మరెక్కడా కానరాదు. కనుకనే విదేశములకు వెళ్ళేవారికి ఉపదేశిస్తూ వచ్చారు ప్రాచీనులు. "పిచ్చివాడా! దేశ దేశములు తిరిగి దేశదిమ్మరిగా మారిపోతున్నావు. దేని కోసం తిరుగుతున్నావు? దేనిని ఆశించి నీవు విదేశములకు వెళ్ళుతున్నావో! ఆ ఆశించిన వస్తువు నీయందే ఉంటున్నది. నీయందే గోప్యంగా ఉండినటువంటి పదార్థమును, నీవు గుర్తించుకొనలేకపోతున్నావు" అన్నారు. కనుకనే ఆ 'నేను' అనేటటువంటి వ్యక్తిత్వాన్ని నిరూపిస్తూ వచ్చింది వేదం. 'వ్యక్తి' అనగా ఏమిటి? అవ్యక్తమై, గూఢంగా, తనయందే యిమిడి ఉన్న తత్వాన్ని గుర్తించినటువంటివానినే 'వ్యక్తి' అన్నారు. దేహమును 'వ్యక్తి' అని పిలచటం లేదు. అవ్యక్తమైనటువంటి దివ్యత్వం, తనయందు ఇమిడి ఉన్నటువంటి దానిని గుర్తించినటువంటి వానినే 'వ్యక్తి' అన్నారు. ఏ మానవుడు తనయందున్న దివ్యత్వాన్ని గుర్తించడో, వాడు 'వ్యక్తి' కానే కాడు. కనుక ఈ వ్యక్తిత్వమును మనం అభివృద్ధి పరచుకోవాలి. సర్వత్రా ఇమిడి ఉన్నటువంటి 'సత్యం వద, ధర్మం చర' ఇది వ్యక్తిత్వాన్ని పోషించడానికి మూలం. కనుక భారతీయ సంస్కృతి యందు ఈ రెండూ బోధించబడినాయి. ఇలాంటి పవిత్రమైన వాటిని ప్రబోధించే నిమిత్తమై, ఈ దేహమును ఒక పనిముట్టుగా అందించాడు భగవంతుడు. కనుక ఏ దివ్యమైన శక్తులు, మన యందు ఇమిడి ఉన్నాయో, వాటిని క్రమక్రమేణా అర్థం చేసుకోవటానికి ప్రయత్నించాలి.

పుట్టిన తక్షణమే ఏ వ్యక్తీ 'విద్యార్థి' కాదు. పుట్టిన తక్షణమే ఏ వ్యక్తీ పండితుడు కాడు. క్రమక్రమేణా సాధనలు సలిపి, ఆ సాధనల ద్వారా ఆవిర్భవింపజేసుకున్నవే ఆ విద్యలు. ఇట్టి ఆవిర్భవింపజేసుకున్న వాటినే Educare అన్నారు. ఈనాడు మనం చదువుకుంటున్న చదువులు అన్నీ Education మాత్రమే. ఇవన్నీ Artificial. Art బయట ఉన్నది. Heart లోపల ఉన్నది. Art is outside, Heart is inside. కనుక 'Art' అంతా Education. Heart మాత్రం Educare. దానినే మనం ఆవిర్భవింప జేసుకొని, తిరిగి బయటకు తెప్పించుకోవాలి. అసలు చదువు చదివినటువంటివాడు ఈ జగత్తులో కానరాడు. కనుక దీనికి ఒక్క ప్రమాణం కూడా ఏర్పర్చారు.

"చదువులన్నియు చదివి చాల వివేకియై
మదిని తన్నెరుగడు మందమతుడు
ఎంత చదువు చదివి ఏ రీతి ఉన్నను
హీనుడు గుణంబు మానలేడు."
"తరచి చదువ చదవ తర్కవాదమె కాని
పూర్ణ జ్ఞానం బెపుడు పొందలేడు
చదువులన్నియు చదివి చావంగ నేటికి
చావులేని చదువు చదువవలయు"

## నీ చిరునామా ఏమి?

నీ చిరునామా ఏమి? నిజము తెలుపుమా! సాయి!
పుటపర్తా! నీ చిరునామా! కానేకాదది చిరునామా!
॥నీ చిరు॥
సర్వజగత్తా! నీ చిరునామా-వెండి కొండయా! నీ చిరునామా!
సప్తదుర్గమా! నీ చిరునామా-హిమాద్రి శిఖరమా! నీ చిరునామా! ॥నీ చిరు॥
పుణ్యస్థలములా! నీచిరునామా!
చతుఃస్సాగరమా! నీ చిరునామా!
గగన వీధియా నీ చిరునామా!
ముల్లోకములా నీ చిరునామా! ॥నీ చిరు॥
సర్వాంతరమే, నీ చిరునామా!-ఆత్మస్వరూపమె నీచిరునామా!
నీ చిరునామా! చిత్ర విచిత్రము-ఎఱుగుట జన్మ సుకృతము
॥నీ చిరు॥

శుభం భూయాత్

విద్వాన్ కోట శ్రీరామచంద్రమూర్తి, చెన్నై.

## విదురనీతి

"హన్తి జాతాన జాతాంశ్చ
హిరణ్యార్థే2 నృతం వదన్
సర్వం భూమ్యనృతే హన్తి
మాస్మ భూమ్యనృతం వదేః"

బంగారము కోసమై అబద్ధమాడువాడు, పుట్టిన వారిని, పుట్టబోవువారిని కూడా నరకములోనికి త్రోయును. భూమికోసమై అబద్ధమాడువాడు, సర్వమును నశింప జేయును. అందువలన భూమి కోసమై అబద్ధము చెప్పకుము.

అదియే మనం ఈనాడు తెలుసుకోవలసింది. దేనికి చావులేదు. ఆ 'I' అనే దానికి చావు లేదు. అది ఎప్పటికీ చావదు. బ్రహ్మవిష్ణుమహేశ్వరులు సత్య స్వరూపులు. ఆ సత్యస్వరూపులకు 'నేను' అనే పదమును ఉపయోగ పెట్టారు. కనుక అట్టి 'నేను' అనేటటువంటి దానిని ఈ దేహముగా భావించకూడదు. దేహమును గుర్తింపజేసేటటు వంటి శబ్దమే ఈ 'I' అనేటటువంటిది. దేహము ఒక పదార్థము. అన్నిటికీ మూలం పదార్థమే. 'యదృశ్యం, తన్నశ్యం' ఏది కంటికి కనిపిస్తున్నాయో, అవన్నీ కనిపించకుండా పోయేటటువంటివే. నశ్యమయ్యేటటు వంటి పదార్థమును మనం సత్యంగా భావిస్తున్నాం. ఈ దృశ్య కల్పితమైనటువంటి పదార్థమును మనం సత్యంగా భావిస్తున్నాం. దృశ్యమంతా అదృశ్యమయ్యేటటువంటిదే. ఈ సృష్టి కూడా ఏదో ఒక సమయంలో నాశనమయ్యేటటు వంటిదే. ఈ దృష్టియంతా కూడనూ, మన సృష్టిని కోసమే పంపించాడు. నీ దృష్టి చేతనే సృష్టిగోచరమవుతున్నది. నిజంగా దృష్టియే లేకపోతే, సృష్టియే కనిపించదు. కనుక ప్రతిదానిని మన దేహము ద్వారానే అన్నింటిని గుర్తింప జేసుకోగలుగుతున్నాం.

ఈ దేహం ఏదో ఒక రోజున మరణిస్తుంది. కనుక ఈ జీవిత కాలంలోనే మనం చేయవలసిన మంచి కార్యాలు చేసి ఈ జీవితాన్ని సార్థకం చేయాలి. సత్ప్రవర్తన తో జీవించాలి. సచ్చింతనలతో దేహమును వదలాలి. దేహం శాశ్వతం కాదు. మలమూత్ర దుర్గంధ మాంస రక్తమే ఈ దేహం. కాని మన అంతర్భావమునందు పవిత్రమైన గుణాలు ఉంటున్నాయి. వాటిని కాపాడుకునే నిమిత్తమై, మనం ఈ దేహమును పోషించుకోవాలి. వాటిని సాధించిన తరువాత ఈ దేహమును త్యజించాలి. దీని వలన వచ్చేటటువంటి లాభం ఏమాత్రం లేదు. సేవలయందు మనం పాల్గొనాలి. తీర్థయాత్రలవలన గాని, పుణ్యక్షేత్రాలను సందర్శించటం వలన గాని భగవంతుని పేరు ఉచ్చరించడం వలన గాని, పవిత్రమైన గ్రంథాలు చదవటం వలన గాని ఈ జీవన మహాసాగరమును దాటలేము. సేవల వలననే దీనిని దాటగలుగుతాం, ముక్తిని సాధించగలుగుతాం. మానవ సేవకు మించినది లేదు.

"ఈనాడు అనేకమంది విద్యలనభ్యసిస్తున్నారు, ధనం సంపాదిస్తున్నారు. దేనివలన ఇవి లభ్యమవు తున్నాయి? దేహము వలననే గదా! కనుక దేహం చాలా ప్రధానమైనటువంటిది. ఈ సత్యమును ఈ జీవిత కాలంలోనే గ్రహించి, దేహమును సార్థకం చేసుకోవాలి. దేహమును మనకిచ్చింది సుఖాల కోసము, సౌందర్యాన్ని పోషించుకోవటం కోసము, జీవించటం కోసం కాదు. జర్మన్ చేతిలో ఫ్రెంచివారు ఓడి పోయారు. ఫ్రెంచి సైన్యాధిపతి మహావీరుడు. అప్పుడు ఆయన చెప్పాడు 'ఈ ఫ్రెంచి దేశం ఓడిపోయింది యుద్ధ భూమిలో కాదు. భోగ భాగ్యములలో మునిగి ఈ యుద్ధ భూమిలో ఓడిపోయారు' అన్నాడు. ఈ భోగభాగ్యముల కోసమే, ఈ దేహమును ఉపయోగపెట్టుకుని, మనం సర్వ విధములా పాడై పోతున్నాం. తుచ్ఛమైన ఈ భోగభాగ్యాలు ఎంతకాలం ఉంటాయి? ఇవి క్షణ భంగురములు, కనుక ఈ భోగ భాగ్యముల కోసమే, భగవంతుడు ఈ దేహమును ఇచ్చాడని భావించరాదు.

గ్రామమునకు ఇండ్లే శృంగారము. సముద్రము నకు అలలే శృంగారము. ఆకాశమునకు చంద్రుడే శృంగారము, స్త్రీకి గుణమే శృంగారం, భిక్షులకు నొసట విభూతే శృంగారము. కనుక మానవునకు గుణమే శృంగారము. ఆ గుణ శృంగారమును ఈనాడు విసర్జించి బాహ్య శృంగారము కోసం భ్రమించిపోతున్నాం.

ప్రేమస్వరూపులారా! విద్యార్థులారా! మీరు యువకులు, ఇంకా ఎంతో కాలం దీర్ఘ ప్రయాణం సలుప వలసినవారు. అలాంటివారు దేహాభిమానమును పెంచు కోకండి. దేహక్షేమాన్ని మాత్రం పెంచుకొండి. దేహ ఆరోగ్యమును కాపాడుకోండి. ఆరోగ్యమును కాపాడుకొని,

మనం చేయవలసిన మంచి కార్యములను సాధించండి

"అస్థిరం జీవనంలోకే
అస్థిరం యౌవనం ధనం
అస్థిరం దారాపుత్రాది
సత్యం కీర్తిర్ద్వయం సుఖం"

ఏమిటా ద్వయం? సత్యం, కీర్తి, ద్వయం స్థిరం. కనుక ఆ సత్యమార్గమును వదలకుండా కాపాడుకోవాలి. ఆ సత్యం చేతనే 'కీర్తి' మనకు లభ్యమవుతుంది. సత్యమే లేకపోతే 'కీర్తి' మనకు లభ్యమే కాదు. కనుక మనం సత్యాన్ని కాపాడాలి. చాలామంది రాజకీయ నాయకులు ఈనాడు దేశాన్ని కాపాడండి!... దేశాన్ని కాపాడండి!... అని బోధ చేస్తుంటారు. ఇదికాదు. సత్యధర్మాలను మనం కాపాడు తుంటే, ఈ సత్యధర్మాలే దేశమును కాపాడుతాయి. 'ధర్మో రక్షతి రక్షితః'. ధర్మాన్ని మనం రక్షిస్తే, ధర్మమే మనల్ని రక్షిస్తుంది. కనుక ధర్మాన్ని వదిలి పెట్టి, దేశమును దమంటే, దేశమును ఎవరు కాపాడకలరు. ధర్మాన్ని మనం కాపాడితే, ఆ ధర్మమే దేశాన్ని కాపాడుతుంది. ఈనాటి మానవుని యందు ధర్మం శూన్యమై పోయింది. న్యాయం కనిపించటమే లేదు. సత్యమనేది సాక్షాత్కారమే లేకుండా పోతున్నది, మరుగున పడిపోతున్నది. ఇలాంటి వారి చేత, దేశం ఏవిధంగా రక్షించబడుతుంది?

వేషమునకు తగ్గ భాష మాట్లాడాలి. ఈనాడు మీరందరూ విద్యార్థి దశలో ఉన్నారు. విద్యార్థికి తగిన గుణములను పోషించుకోవాలి. విద్యార్థికి తగిన గౌరవాన్ని సంపాదించాలి. విద్యార్థి వేషమునకు-తగిన ప్రవర్తన మీలో ఉండాలి. విద్యార్థికి తగిన వినయ విధేయతలను ప్రకటించాలి. విద్యకు వినయమే రక్షణ. కనుక విద్యార్థులు, వినయ విధేయతలతో, గౌరవ మర్యాదలతో, సత్య వాక్కులతో, ధర్మాన్ని ఆచరిస్తూ ముందుకు పోతుండాలి. కనుక విద్యార్థి వేషమునకు తగిన ప్రవర్తన లేకపోతే, ఆ వేషమునకు అవమానకరం.

ప్రేమస్వరూపులారా! విద్యా వేషమునకు తగినటు వంటి ప్రవర్తన మనలో ఉండాలి. విద్యార్థికి చూపులు చాలా ప్రధానమైనటువంటివి. చూపులు దేనిని చూడాలో, దానిని మాత్రమే చూడాలి. బజారు పోయే వారందరినీ చూడకూడదు. ఆవిధంగా చూస్తే, అది కాకి దృష్టిగా రూపొందుతుంది. గ్రంథమును చూడు, చదువు. తల్లిదండ్రులను చూడు, మిత్రులను చూడు. అంతేగాని చూడరాని వారిని చూడకూడదు. ప్రతి స్త్రీని చూడకూడదు. మీ వయస్సులో ఉన్న స్త్రీలను అక్క చెల్లెండ్రులుగా భావించాలి. పెద్దవారిని తల్లులుగా విశ్వసించాలి. కండ్లు ఉన్నాయి గదాయని ఇష్టము వచ్చినట్లుగా చూడరాదు. సైకిలు మీద పోతూ, దారిలో ఉన్న సినిమా పోష్టర్లను చూస్తూ పోతుంటే ప్రమాదానికి గురి అవుతారు. రోడ్డుపైననే దృష్టి నిలపాలి. కనుక దృష్టిని అదుపులో పెట్టుకోవాలి. **కనుక చెడ్డ చూపులు చూడకండి! చెడ్డ మాటలు వినకండి!! చెడ్డ చింతనలు చేయకండి! చెడ్డ మాటలు మాట్లాడకండి! విద్యార్థులకు ఈ గుణములే అలంకారములు. ఈ వయసులోనే ఈ గుణములను సంపాదించుకోవాలి.**

విద్యార్థులారా! మీరు ఈ వయసులోనే చాలా ఘనకీర్తిని సంపాదించాలి. నేటి బాలబాలికలే రేపటి పౌరులు. ఈనాటి యువకులే రేపటి నాయకులు. నాయకులై దేశమును పవిత్రం గావించాలి నాయకుల మీదనే దేశ భవిష్యత్తు ఆధారపడి ఉంటుంది. మీరు మంచివారైతే, దేశం కూడా మంచిదౌతుంది పవిత్రమైన భారతదేశమును, త్యాగభూమియైన భారతదేశమును, కర్మ భూమియైన భారతదేశమును, పుణ్య భూమియైన భారతదేశమును, మీరు పుణ్యపురుషులై అట్టి భారతదేశ గౌరవ ప్రతిష్ఠలను మీరు పెంపొందించాలి. అందు నిమిత్తమై, మీరు ఈ దేహమును కాపాడుకోవాలి. కనుక 'దేహము' అనేది పోతే తిరిగి రాదు. దేనినైనా సాధించ వచ్చును గాని, దేహం పోతే దానిని తిరిగి సాధించలేము. కనుక లక్ష్యమును సాధించేంత వరకు నీ ప్రయాణం సాగించు అదియే మీ లక్ష్యముగా తీసుకోవాలి. దానినే మీరు ప్రతిజ్ఞగా పట్టాలి. (ది. 17-5-2000న, వేసవి తరగతుల సందర్భమున బృందావనం (బెంగుళూరు)లో భగవాన్ చేసిన దివ్య ప్రసంగం నుండి)

"యే చైవ మాం ప్రశంసతి
యేచ నిందంతి మానవాః
సర్వాన్ సుపరిణీ తేన
కర్మణా తోషయామ్యహమ్"

ఏ మానవులు నన్ను కొనియాడెదరో, ఏ మానవులు నన్ను నిందించుదురో, వారందరిని నేను సద్వ్యవహారంతో సమంగా సంతోషపరుస్తాను.

స్వాతంత్ర్య దినోత్సవ ప్రత్యేక వ్యాసం

# త్యాగశీలురు  కర్మయోగులు

స్వాతంత్ర్య సంగ్రామంలో త్యాగం చేసిన "త్యాగశీలురు" కొందరైతే, స్వాతంత్ర్యానంతరం నిష్కామకర్మ చేసి, స్వర్ణభారతిని నిర్మించాలనే తాపత్రయంతో స్వార్థ రహితంగా, అతి నిరాడంబర జీవితాన్ని గడుపుతూ, ప్రభుత్వ సొమ్మును ఏమాత్రం దుర్వినియోగం చేయకుండా, అవినీతికి ఏ మాత్రం 'ఆస్కారంలేని మంచి పాలనను అందించిన కర్మయోగులు మరికొందరు. అయితే ఈనాడు ఆ తరం అంతరించి పోయింది. విత్తనం నాటి మొక్కను మొలిపించి, దానిని పెద్దదిగా చేయటానికి చాలా కష్టపడాలి. ఆ మొక్క పెరిగి పెద్దదై వృక్షమైన తరువాత దానిని పోషించడానికి అంతగా కష్టపడనవసరం లేదు. అదేవిధంగా 'స్వాతంత్ర్యం' అనే విత్తనాన్ని నాటి, మొక్కను మొలిపించడానికి, దానిని వృక్షంగా పెంచడానికి ఎందరో మహనీయులు నిస్వార్థంగా కృషి చేశారు. తమ సర్వస్వాన్ని సమర్పించారు. స్వాతంత్ర్య ఫలాలను మనకందించి కన్ను మూశారు. అమర వీరులైనారు. అయితే మనం ఈనాడు ఏ మాత్రం కష్టపడకుండా ఆ ఫలాలను ఆరగిస్తున్నాం, అనుభవిస్తున్నాము. ఆనాడు కష్టపడింది ఒకరైతే ఈనాడు కష్టపడకుండా అనుభవిస్తుంది మరొకరు. కష్టపడ్డవాడికి సుఖం విలువ తెలుస్తుంది. కష్టపడి సంపాదించిన వాడికే సొమ్ము విలువ తెలుస్తుంది. కష్టపడకుండా, శ్రమపడకుండా, అయాచితంగా సంపద వచ్చిపడితే ఆ సంపద విలువ తెలియదు. శ్రమపడకుండా వచ్చిన సంపదను భోగ విలాసాలకు దుర్వినియోగం చేస్తారు. పోటీపడి ఆ సంపదను కొల్లగొట్టడానికి ప్రయత్నిస్తారు. దేశ సంక్షేమాన్ని పట్టించుకోవడానికి ఏమాత్రం ప్రయత్నించరు, పట్టించుకోరు. వ్యక్తిగత స్వప్రయోజనాలకే ప్రాముఖ్యత యిస్తారు. అదే ఈనాడు మన దేశంలో జరుగుతున్న తతంగం. ఇదే పరిస్థితి కనుక మరికొంతకాలం కొనసాగుతే, ఈ పవిత్ర భారతావని భవిష్యత్తు మృగ్యమైపోతుంది. దేశ ఆర్థిక వ్యవస్థ ఛిన్నాభిన్నమైపోతుంది. దేశ స్వాతంత్ర్యానికే ప్రమాదం వాటిల్లినా ఆశ్చర్యపడనవసరం లేదు. అప్పుడు ఈ దేశ స్వాతంత్ర్యం కోసం, త్యాగం చేసిన అమరవీరుల ఆత్మలు సంక్షోభిస్తాయి.

అటువంటి దుస్థితి రాకూడదని, రాకుండా ఉండటానికోసం, యువతను జాగృతం చేయడానికి చేసే ప్రయత్నంలో ఒక భాగమే శ్రీవాణి చేస్తున్న ఈ చిన్ని ప్రయత్నం. స్వాతంత్ర్య సంగ్రామంలో త్యాగాలు చేసిన త్యాగశీలుర జీవితాలలోని కొన్ని సంఘటనలను, స్వాతంత్ర్యా నంతరం నిస్వార్థంగా, నిరాడంబరంగా పరిపాలన చేసిన కర్మయోగుల జీవితాలలోని మరికొన్ని సంఘటనలను ఈనాటి యువతకు అందించాలనే పరమావధితో ఈ చిన్ని వ్యాసమును శ్రీవాణి ద్వారా సమర్పించుకుంటున్నాను. ఆ మహానుభావుల జీవిత చరిత్రలలోని అమూల్యమైన విషయాలను చదివి, ఆకళింపు చేసుకొనిన పెద్దలు, తమ పిల్లలకు బోధించి, చక్కటి భావిభారత పౌరులుగా తీర్చి దిద్దుతారనే ఆశతో, విశ్వాసంతో ఈ వ్యాసమును ప్రత్యేకంగా శ్రీవాణి పాఠకులకు స్వాతంత్ర్య దినోత్సవ సందర్భమున అందిస్తున్నాను.

**కొమరగిరి కృష్ణమోహనరావు**

### బాలగంగాధర తిలక్

'స్వాతంత్ర్యము నా జన్మహక్కు' అని సింహగర్జన చేసి ప్రజలను మేలుకొలిపి, స్వాతంత్ర్యోద్యమంలో పరవళ్ళు త్రొక్కించిన మహావీరుడు బాలగంగాధరతిలక్. ఆయనను విలేఖరులు ఒక పర్యాయం **"అయ్యా! స్వాతంత్ర్యం వచ్చిన తరువాత తమరు ప్రధాని పదవిని చేపడుతారా? అని అడిగితే, నేను ఒక్కడినే ప్రధానినైపోతే ప్రయోజనం ఏమిటి? అనేకమంది ప్రధానులను చేయగలిగే ఉపాధ్యాయుడుగానే ఉంటాను. భారతదేశాన్ని రక్షించే యువకులను తర్ఫీదు చేసే ఉపాధ్యాయ స్థానమే నాకు గొప్ప పదవి"** అని సమాధానం చెబుతారు తిలక్ మహాశయులు. మాండలే జైలులో శిక్ష అనుభవిస్తున్న సమయంలో ఆయన భార్య మరణిస్తుంది. జైలు అధికారులు టెలిగ్రాం తెచ్చి యిస్తారు. ఆ టెలిగ్రాంను చదువుకొని బల్లమీద పెడతారు తిలక్. కనీసం కన్నీరు కూడా కార్చరు. జైలు అధికారులకు

ఆశ్చర్యం వేసి, "మీ ధర్మపత్ని పరమపదించిరి. అయినను మీ కంటి వెంట ఒక్క కన్నీటి బిందువు కూడా రాలేదేమి? అని అడుగుతాడు జైలు అధికారి. అప్పుడు తిలక్ "I have no tears to shed at this occasion, because I have shed them all for my country" (ఈసమయంలో నా నేత్రములనుండి ఒక్క కన్నీటి చుక్క గూడా రాల్చలేను. కారణమేమనగా, ఉన్న కన్నీటినంతటినీ నా మాతృభూమి కొరకు ఇదివరకే కార్చినాను) అని అంటారు తిలక్. తిలక్ మహాశయుని దేశభక్తి అంతటిది. స్వార్థమెరుగని త్యాగశీలి. పదవులను ఏమాత్రం కోరని మహనీయుడు తిలక్. స్వాతంత్ర్యం ఆయన జీవిత లక్ష్యం. అటువంటి మహనీయుల త్యాగాల వలననే మనకు స్వాతంత్ర్యం సిద్ధించింది. అయితే ఈనాడు మనం కష్టపడ కుండానే దానిని అనుభవిస్తున్నాం, దోచుకుంటున్నాం, దాచు కుంటున్నాం. ఇది ఈనాటి స్థితి, దుస్థితి.

## బాబూ రాజేంద్రప్రసాద్

ఆయన ఇల్లు పాట్నా నగరంలో ఒక పెద్ద బంగళా. అందులో చాలా గదులు ఉండేవి. వచ్చేపోయే వారితో ఆ బంగళా నిత్యమూ కళకళలాడుతూ ఉండేది. ఎవరి పనుల నిమిత్తం వారు వచ్చేవారు. ఆ బంగళాలో ఉండటానికి మంచి వసతి ఉన్నది కాబట్టి, అక్కడ ఉండి, ఎవరి పనులు వారు పూర్తి చేసుకుని వెళ్ళేటప్పుడు ఆ బంగళా యజమాని వద్దకు వెళ్ళి 'బాబుగారు! వెళ్ళివస్తాం!'అనేవారుట. అప్పుడు ఆయన "మీది ఏ ఊరు? ఎక్కడికి వెళ్ళాలి? ఛార్జీలు ఉన్నాయా?" అని అడిగి ఛార్జీలతో పాటు, ఇతర ఖర్చులు కూడా ఇచ్చి పంపేవాడుట. ఆయన ఎవరో కాదు. ఆ త్యాగమూర్తే బాబూ రాజేంద్రప్రసాద్. ప్రముఖ న్యాయవాది. న్యాయవాద వృత్తి ద్వారా ఆ రోజులలోనే ప్రతి నెలా వేలాది రూపాయలు సంపాదించే ధనవంతుడు ఆయన. ఒకసారి, గాంధీజీ పిలుపునందుకుని, సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొనబోయే ముందు, తన భార్యను పిలిచి 'నా వద్ద ఉన్నవి తొమ్మిది రూపాయలు మాత్రమే. ఇవి తీసుకో! నేను ఎప్పుడు తిరిగి వస్తానో! నాకే తెలియదు'అని చెప్పి ఉద్యమంలో పాల్గొనడానికి వెళ్ళుతాడు బాబూ రాజేంద్రప్రసాద్. ప్రతినెలా వేలాది రూపాయలు సంపాదించే ఆ ధనవంతుడు, సత్యాగ్రహానికి వెళ్ళేటప్పుడు, తన భార్యకు కేవలం తొమ్మిధి రూపాయలు మాత్రమే ఇవ్వగలిగాడంటే, ఆయన నిత్యమూ చేసే వితరణ ఎంతటిదో ఆశ్చర్యం వేయక మానదు. ఆనాటి స్వాతంత్ర్య మహోద్యమంలో ఆయన చేసిన త్యాగానికి, సమయస్ఫూర్తి తో ఆయన ప్రదర్శించిన చాక చక్యానికి ప్రజలు ముగ్ధులై, ఆనాటి నుంచే ఆయనను 'బీహార్ గాంధీ' అని పిలిచేవారు. ఆయన కాంగ్రెస్ అధ్యక్ష పీఠాన్ని అలంకరించారు. స్వాతంత్ర్యానంతరం భారత రాజ్యాంగ పరిషత్ సభాధ్యక్షు లైనారు. పది సంవత్సరాలపాటు భారత రాష్ట్రపతిగా అత్యున్నతమైన సేవలందించి పేరు ప్రఖ్యాతులను గడించారు. స్వాతంత్ర్యోద్యమంలో తన సర్వస్వాన్ని సమర్పించారు. చిట్టచివరకి తన బంగళాను కూడా కోల్పోయారు. పది సంవత్సరాలపాటు రాష్ట్రపతి పదవిని అలంకరించి కూడా, తనదంటూ ఒక స్వంత ఇల్లును ఏర్పాటు చేసుకోలేకపోయిన నిస్వార్థ త్యాగి బాబూరాజేంద్ర ప్రసాద్. రాష్ట్రపతి పదవీ విరమణ చేసిన తరువాత "సదాకత్" ఆశ్రమంలో ఒక ప్రక్కన నివసిస్తూ, అక్కడనే ఆయన కన్ను మూసారంటే, నమ్మ శక్యం కాని నగ్నసత్యం అది. ఎంతోమందికి ఆశ్రయాన్నిచ్చిన ఆయనకు చిట్టచివరికి ఆశ్రమం గతి అయింది. ఇది నిజంగా హృదయ విదారకమైన విషయం. ఆయన జీవితమే ఆయన సందేశం. అయితే ఈనాడు చాలామంది చెట్టుపేరు చెప్పి కాయలమ్ము కుంటున్నారు. ఆ చెట్టు నాటింది ఒకరైతే, పోషించింది ఇంకొకరు. అయితే ఈనాడు వాటి ఫలాలను మాత్రం అనుభవిస్తున్నది మరొకరు. ఈనాడు మనకు కనిపిస్తున్న వాస్తవం ఇదే.

## రాజగోపాలాచారి

రాజగోపాలాచారి మద్రాసు ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు, మద్రాసులోని గిండీ ఇంజనీరింగ్ కాలేజీ, కర్ణాటక సంఘ విద్యార్థులు, తమ సంఘ ప్రారంభోత్సవానికి రాజాజీని ఆహ్వానించడానికి ఆ సంఘనాయకులు వచ్చారని కబురు అందగానే, రాజాజీ తమ ఆఫీసు నుండి క్రిందకు దిగివచ్చి వారిని కలుసుకొని, తన అంగీకారమును తెలుపుతారు. ప్రారంభోత్సవం రోజున రాజాజీని తీసుకొని వెళ్ళటానికి, ఒక కారును తీసుకొనివచ్చి పోర్టికోలో ఉంచడంగమనించి 'ఈ కారు ఎవరిది?' అని ప్రశ్నిస్తారు రాజాజీ. అప్పుడు ఆ విద్యార్థి నాయకులు 'తమ కోసమే అద్దె కారును తీసుకొని వచ్చాం' అంటారు. 'అప్పుడు

రాజాజీ "మీ సంఘ సభ్యత్వ రుసుముతో, కారు అద్దెకు తీసుకోవడం మీ శక్తికి మించింది. కారును వాపసు పంపండి! నేను సైకిల్ రిక్షాలో వస్తాను. ప్రైవేటు కార్యక్రమాలకు ప్రభుత్వ వాహనమును ఉపయోగించడం మంచిదికాదు" అని చెప్పి ఆ కార్యక్రమానికి రిక్షాలో వెళ్ళుతారు రాజాజీ. ఈ సంఘటన ఆయన నిరాడంబరతను నిస్వార్థతను చాటుచున్నది. ప్రభుత్వం కలిపించిన ఉచిత సౌకర్యాలను ఆయన ఏనాడూ తన స్వంతానికి ఉపయోగించుకోలేదు. ప్రభుత్వంతో సంబంధం లేని పనులకు తన స్వంత పైకాన్నే వెచ్చించేవారు. ఈనాటి ప్రభుత్వ నేతలు రాజాజీని అనుసరించుతే ప్రభుత్వ సొమ్మును ఎంతో పొదుపు చేసినవారవుతారు. రాజాజీ భారతదేశ గవర్నర్ జనరల్‌గా కూడా పనిచేసారనే విషయం మరచిపోకండి.

## లాల్ బహదూర్‌శాస్త్రి

'శాస్త్రి' అనేది కాశీ విద్యాపీఠము వారు ప్రదానం చేయు Master Degree లాల్‌బహదూర్ 4 సంవత్సరాల పాటు సంస్కృత, ఆంగ్ల, హిందీ భాషలనభ్యసించి, సోషియాలజీ, పొలిటిక్స్‌లతో పాటు, ఫిలాసఫీ ప్రధాన విషయంగా ఉత్తీర్ణతను సాధించి 'శాస్త్రి' డిగ్రీని పుచ్చుకున్నారు. 1927వ సం॥లో శాస్త్రీజీ, లాలాలజపతిరాయి స్థాపించిన, లోక్‌సేవా సంఘంలో సభ్యుడై, దాని ద్వారా నెలకు 60 రూపాయిల వేతనం పై జనసేవావ్రత జీవితం ప్రారంభించారు అదే ఆయన రాజకీయ జీవితానికి శ్రీకారం చుట్టింది. రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలలో అనేకమంత్రి పదవులను పొంది తన నిజాయితీని రుజువు చేసుకున్నారు. చిట్టచివరకు భారతదేశ ప్రధాని పదవిని కూడా చేపట్టి కేవలం 19 మాసాల రెండు రోజులు ఆ పదవిలో ఉండి పేరు ప్రఖ్యాతులునందుకొనినారు. శాస్త్రీజీ యిచ్చిన "జైకిసాన్, జైజవాన్" నినాదం సైనికులకు, రైతులకు ఉత్సాహ ప్రోత్సాహాలనిచ్చింది. ఆయన కాలంలోనే పాక్ దురాక్రమణను త్రిప్పి కొట్టటం జరిగింది. ఆయన శక్తి సామర్ధ్యములను ప్రపంచ దేశాల వారు కూడా ప్రశ్నించారు. పొట్టివాడు చాలా గట్టివాడని పించుకున్నాడు శాస్త్రీజీ. కేంద్రంలో రైల్వే మంత్రిగా ఉన్నప్పుడు దురదృష్టవశాత్తు తమిళనాడులో ఘోరమైన రైలు ప్రమాదం జరిగి 115 మంది ప్రయాణీకులు మరణించగా, నైతిక బాధ్యతను స్వీకరించి, తన మంత్రి పదవికి రాజీనామా చేసి, తన నీతినిజాయితీ లను నిరూపించుకున్నారు శాస్త్రీజీ. తొలిసారిగా ఆయన కేంద్ర మంత్రి పదవిని అలంకరించి నప్పుడు, ఆయన అనుమతి లేకుండానే, ఆయన పర్యటనలో నున్నప్పుడు ఆయన, నివాస గృహానికి 'ఎయిర్ కండీషన్' ఏర్పాటు చేసారుట. పర్యటన ముగించుకొని వచ్చిన తక్షణమే అధికారులను పిలిపించి '**మంత్రి పదవి ఒక మహత్తరమైన బాధ్యతేగాని, అది అధికార భోగ్యం, విలాసయోగ్యం కారాదు. సుఖసౌకర్యాలపేరుతో మనం ప్రజాధనాన్ని దుర్వినియోగం చేయరాదు. లభించిన పదవిని సేవాదృష్టితో నిర్వహించాలి.**' అని చెప్పి అప్పటికప్పుడే ఆ ఎయిర్‌కండీషన్‌ను తొలగించి వేయించారుట. అత్యున్నతమైన పదవులను అధిష్ఠించినా భోగవిలాసాల నాశించని నిరాడంబరుడు, నిజాయితీపరుడు. స్వార్ధమెరుగని సేవా నిరతుడు. పరిపాలనా దక్షుడుగా కీర్తి శిఖరాలనందుకొనిన కర్మయోగి శాస్త్రీజీ.

భారత ప్రధానిగా ప్రజల మన్ననలను అందుకొనిన లాల్‌బహదూర్ శాస్త్రి స్వంత ఇల్లు అంటూ లేకుండానే పరమపదించారు. చిన్న చిన్న పదవులను పొంది ఈనాడు లక్షలూ, కోట్లూ, సంపాదించి వెనుక వేసుకుంటున్న స్వార్థపరులకు శాస్త్రీజీ ఆదర్శ నిరాడంబర జీవితం ఏనాటికి గుణపాఠం నేర్పుతుందో! కాలమే నిర్ణయించాలి.

## మోక్షగుండం విశ్వేశ్వరయ్య

విశ్వవిఖ్యాత ఇంజనీరుగా, పరిపాలనాదక్షుడుగా, మైసూరు సంస్థాన దివానుగా గొప్పపేరు గడించిన మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారు, దివాన్ పదవిని స్వచ్ఛందంగా విరమణ చేస్తారు. పదవీ విరమణ చేసిన రోజున సాయంత్రం 5గంటలు కల్లా తమ పనులన్నింటినీ

## ఆణిముత్యాలు - అనుభవసత్యాలు

1. **గడించేది ఒకడు, అనుభవించేదింకొకడు**
2. **గతిచెడినా, మతిచెడరాదు**
3. **చెప్పలు ఉన్నవాడితోను, అప్పులు ఉన్నవాడితోను పోరాదు.**
4. **జరుగుపాటు తక్కువ, అదరిపాటు ఎక్కువ**
5. **తప్పచేసిన వానికి, అప్పచేసిన వానికి ముఖం చెల్లదు.**

పూర్తిచేసుకొని, చేతికర్రను తీసుకొని కార్యాలయం నుండి బయటకు వస్తారు. పోర్టికోలో కారు సిద్ధంగా ఉంటుంది. డ్రయివర్ కారు డోర్‌ను తెరచినిలుచుంటాడు. అప్పుడు డ్రయివరుతో విశ్వేశ్వరయ్యగారు "ఇది దివాన్‌గారి కారు. నేను ఇప్పుడు దివాన్‌ను కాదు. నా దివాన్‌గిరి ముగిసింది. ఈ కారులో కూర్చునే హక్కు నాకు ఇప్పుడు లేదు" అని చెప్పి కాలినడకన తన ఇంటికి వెళ్ళుతారు విశ్వేశ్వరయ్య గారు.

మైసూరు సంస్థానమునకు చేసిన ఆయన సేవలకు ప్రతిఫలంగా ఇచ్చిన రెండు లక్షల రూపాయిల పారితోషికాన్ని మహారాజుగారికి త్రిప్పిపంపుతూ 'కనీసం ఒక పారిశ్రామిక శిక్షణా సంస్థకు తమ పేరు (జయచామరాజేంద్ర) పెట్టనివ్వండి' అని లేఖ వ్రాస్తారు విశ్వేశ్వరయ్య గారు. ఆ తరువాత దివాన్ మీర్జా ఇస్మాయిల్ సంస్థాన పరంగా ఇల్లు నిర్మించి ఇవ్వనున్నట్లు తెలిపినప్పుడు, అద్దె పుచ్చుకుంటేనే ఆ ఇంట్లో వుంటానన్నారు విశ్వేశ్వరయ్య.

అధికారంపోయినా, మంత్రిపదవులు వూడినా అధికార నివాసాలను ఖాళీచేయనివారు విశ్వేశ్వరయ్యగారి నిస్వార్ధ పరాయణత్వాన్ని తెలుసుకొని సిగ్గుపడాలి.

## మణీబేన్ పటేల్

'మణీబేన్' సర్దార్‌వల్లభాయి పటేల్ కూతురు. ఒకసారి మహవీర్ త్యాగి 'సర్దార్' ఇంటికి వెళ్ళుతాడు. 'మణీబేన్' ను చూస్తాడు. అప్పుడు ఆమె మాసికలు వేసిన ధోవతిని, చీరగా కట్టుకొని ఉంటుంది. త్యాగి ఆశ్చర్యంతో "మణీబేన్! ఇంత గొప్పవ్యక్తి కూతురువై, ఇటువంటి మాసికలు చీరె కట్టుకోవటం ఏం బాగుంది? నీవు ఒకవేళ ఈ చీరెతో బజారుకు వెళ్ళితే, బిచ్చపుదానివనుకొని, అందరూ నీకు బిచ్చం వేస్తారు" అని అంటాడు. అప్పుడు మణీబేన్ కోపంతో 'అవినీతి సంపాదనతో సిగ్గు పడాలిగాని, మేం కష్టపడి సంపాదించేవాళ్ళం. మేము సిగ్గు పడాల్సిన పనిలేదు' అని అంటుంది. ప్రక్కనే వున్న 'సర్దార్' నవ్వుతూ త్యాగితో "మంచిదే గదా! చాలా పైసలు ప్రోగవుతాయి" అని చమత్కరిస్తారు. అక్కడనే వున్న సుశీలానయ్యర్ కలిపించు కొని "త్యాగీజీ మీరు ఎవరితో మాట్లాడుతున్నారు? మణీబేన్ సంగతి మీకు తెలియదు. ఆమె రోజంతా సర్దార్‌జీ సేవ చేస్తుంది. తరువాత దినచర్య వ్రాస్తుంది. తదుపరి నియమంగా రాట్నం వడుకుతుంది. దానితో వచ్చిన

**సనత్సుజాతీయము :**

రహస్యమైన మోక్షవిద్యను చెప్పమని కోరాడు ధృతరాష్ట్రుడు. నాకు తోచిన ధర్మాలన్నీ చెప్పాను. మోక్ష విద్య చెప్పాలంటే దానికి సమర్థుడు సనత్సుజాతుడే. దేవతలకు కూడా తెలియని వేదాంత విషయాలు ఆయనకే తెలుసు" అన్నాడు విదురుడు. అప్పుడు కుతూహలంతో 'మనం ఇప్పుడు ఏ విధంగా ఆ మహాత్ముణ్ణి దర్శించాలి?'అని అడిగాడు ధృతరాష్ట్రుడు. అప్పుడు విదురుడు భక్తి శ్రద్ధలతో సనత్సుజాతుణ్ణి స్మరించగా, ఆ మహానుభావుడు ప్రత్యక్షమయ్యాడు. విదురుడు భక్తితో ఆతిధ్యమిచ్చి "దేవా! దేని వల్ల మానవులు సుఖదుఃఖాలు, లాభాలాబాలు, ప్రియ ద్వేషాలు మొదలైన ద్వందాలలో పడకుండా జీవన యాత్రను గడిపి, పరమార్థాన్ని పొందగలరో, ఆ పరమార్ధ తత్త్వమును వినాలని ధృతరాష్ట్రుడు కుతూహలపడు తున్నాడు. వినిపించండి! మహాశయా!" అని సనత్సు జాతుణ్ణి కోరాడు విదురుడు. ఆ తత్త్వబోధ వివరాలు వున్న వేదవ్యాస ప్రణీతమైన మహాభారతము ఉద్యోగ పర్వము లోని సనత్సు జాతీయమునకు 'శాంతిశ్రీ' శ్రీ జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రిగారు తెనుగు సేత చేసి 'శ్రీ సనత్సు జాతీయము' అను పుస్తకము ను ముద్రించి నారు. వారి అనుమతితో ఆ గ్రంథములోని ముఖ్య విషయాలను శ్రీవాణి పాఠకులకు అందిస్తున్నాము. వాటిని చదివి ఆకళింపు జేసుకొని పాఠకులు తరించు తారని ఆశిస్తున్నాను. సం॥

## సనత్సుజాతువాచ

"శోకః క్రోధశ్చ లోభశ్చ కామోమానః పరాసుతా
ఈర్ష్యా మోహో విధిత్సాచ కృపా2సూయ జుగుప్సతా."
"ద్వాదశైతే మహాదోషా మనుష్య ప్రాణనాశకాః
ఏకైకమేతే రాజేంద్రః మనుష్యాన్ పర్యుపాసతే
యెరావిష్టో నరః పాపం మూఢసంజ్ఞో వ్యవస్యతి."

సనత్సుజాత మహర్షి ధృతరాష్ట్రునితో ఇలా అన్నాడు. ఓరాజేంద్రా! శోకం, క్రోధం, లోభం, కామం, మానం, నింద, ఈర్ష్య, మోహం, విషయాసక్తి, తన వారిపై దయ, అసూయ, జుగుప్స ఈ పన్నెండు మనుష్యుల ప్రాణాలను నశింపచేసే మహాదోషాలు. ఇవి మనుష్యు లలో క్రమక్రమంగా ప్రవేశిస్తున్నాయి. ఈ ద్వాదశదోషాల చేత ఆవేశింపబడ్డవాడు మూఢుడై పాపకార్యాసక్తుడౌ తున్నాడు.

తెనుగు సేత - 'శాంతిశ్రీ'

దారంతో సర్దార్‌జీ ధోవతి, చొక్కా తయారవుతాయి. సర్దార్‌జీ మీలాగే ఖాదీభండారుకు వెళ్ళి బట్టలు కొనుక్కోరు. సర్దార్‌జీ ధోవతి చినిగిపోయిన తరువాత, మాసికలు వేసుకొని, దానిని మణీబేన్ చీరగా కట్టుకుంటుంది. చినిగి పోయిన చొక్కాను కత్తిరించి రవికగా కుట్టుకొని ధరిస్తుంది' అని చెబుతుంది. అది విని తాను చేసిన పొరపాటుకు పశ్చాత్తాపపడి, సిగ్గుతో తలవంచుకుంటాడు మహావీర్ త్యాగి. సర్దార్ వల్లభాయిపటేల్ భారతదేశ ఉపప్రధానిగా వున్న సమయంలో ఈ సంఘటన జరిగింది. ఈ ఉదంతం పటేల్ మరియు మణీబేన్‌ల నిరాడంబరతను తెలియ జేస్తున్నది. ఆదర్శవంతమైన జీవితాన్ని గడిపినవారు భావితరా లకు మార్గదర్శకులైనారు. అంతేకాదు వ్యక్తి ప్రతిభను చాటేది, ప్రతిష్ఠను పెంచేది బట్టలుకావని, ఆడంబరాలు, అలంకారాలు అంతకన్నాకావని, నిరాడంబరత, సౌశీల్యములు మాత్రమే శాశ్వతమైన కీర్తి ప్రతిష్ఠలు తెచ్చిపెడుతాయని వారు ఆచరణలో నిరూపించారు. అయితే ఈనాడు చెబుతున్నారు కోటి, చేయరు ఒక్కటి. ఆనాటి వారు చేసి చూపించారు. ఈనాటి వారు చేయకుండా చెబుతున్నారు. అది ఆనాటి పరిస్థితి, ఇది ఈనాటి దుస్థితి.

## ఆచార్య కృపలాని

జాతీయోద్యమ సమయంలో, ఒకసారి గాంధీజీతో పాటు ఆచార్య కృపలాని పూనా నగరానికి వెళ్ళారు. వారిద్దరి వద్దా చిల్లిగవ్వలేదు. హోటల్‌కు వెళ్ళుతే బిల్లు చెల్లించటమెలా? అని మథన పడుతున్నారు. అంతలో ఒక విద్యార్థి "గాంధీజీచేత సంతకం చేయించుకోవాలని వచ్చాడు. అప్పుడు కృపలాని "గాంధీజీ ఉచితంగా సంతకం చేయరు'' అన్నాడు. గాంధీజీ కూడా అందుకు సమ్మతించినట్లుగా చిరునవ్వు నవ్వారు. విద్యార్థి పదిరూపాయిల నోటు యివ్వడంతో గాంధీజీ సంతోషంతో సంతకం చేశారు. ఆ ఇద్దరూ రిక్షాఎక్కి హోటల్‌కు వెళ్ళారు. రిక్షావానికి పైకం యివ్వమని చెప్పి, పదిరూపాయిలనోటు కృపలానికి యిచ్చి గాంధీజీ ముందుకు నడిచారు. తరువాత గాంధీజీ "రిక్షావాడికి ఎంతయిచ్చావు?" అని అడుగగా 'ఐదురూపాయిలు' అన్నాడు కృపలాని. 'మిగతా ఐదురూపాయిలు ఎక్కడ' అన్నారు గాంధీజీ. కృపలానీ వెంటనే సమాధానం చెప్పడానికి తటపటాయించారు. రిక్షావాడినుండి మిగతా ఐదురూపాయిలు తీసుకోవటం మరచిపోయారు కృపలానీ. అసలు విషయం చెప్పక తప్పలేదు. అప్పుడు గాంధీజీ "**చూడండీ! ఆ పైకం మన దైవుండిన, నేను పట్టించుకొని వుండేవాడనుకాదు.** కాని **ఆ పైకం ఒక విద్యార్థినుండి తీసుకున్నాం.** కనుక **ప్రతిపైసా విషయంలో మనం జాగ్రత్తగా ఉండాలి"** అన్నారు. కృపలానీ క్షమార్పణ కోరారు. అప్పుడు గాంధీజీ "తప్పు ఒప్పుకోవటం తోనే సరిపోదు. అందుకు తగిన శిక్ష అనుభవించక తప్పదు. ఈ రోజు తమరు వస్తుఉండి ఐదురూపాయిలు పొదుపుచేయాలి'' అన్నారు. గాంధీజీ ఆజ్ఞను అనుసరించి ఆ రోజు కృపలానీ ఉపవాసం ఉంటారు. ఈనాడు ఆ విధంగా శాసించేవారులేరు. శాసించినా అనుసరించేవారు అంతకన్నాలేరు.

## గుల్జారీలాల్ నందా

గాంధీజీ బోధనలకు ప్రభావితుడై, వకీలు వృత్తిని వదలుకొని గుజరాత్‌లో కార్మిక సంఘమును స్థాపించారు గుల్జారీలాల్‌నందా. 1937సం॥లో బొంబాయి రాష్ట్రంలో కార్మిక మంత్రిగా పదవిని చేబట్టారు. ఆ తరువాత కేంద్రంలో అనేక మంత్రి పదవులను సమర్ధవంతంగా నిర్వహించారు. రెండుసార్లు అతి కీలకమైన సందర్భాలలో భారతప్రధానిగా పదవీ బాధ్యతలను కూడా స్వీకరించారు. దాదాపు మూడు దశాబ్దాలపాటు అత్యున్నతమైన మంత్రి పదవులను చేబట్టినా, తన కోసం తాను ఏమాత్రం సంపాదించుకోని నిష్కామ కర్మయోగి 'నందాజీ'. మంత్రి పదవినుండి విరమించుకున్న తరువాత నందాజీ ఎక్కడ ఉన్నది. ఎలాజీవిస్తున్నది? చాలామందికి తెలియదు. ఒకరోజు వార్తా పత్రికలలో వెలువడిన వార్త దేశప్రజలను ఆశ్చర్యచకితులను గావించింది. నందాజీ నివసిస్తున్న ఫ్లాట్ యజమాని ఆ ఫ్లాట్‌ను ఖాళీ చేయమని వత్తిడిచేసి, నందాజీ వస్తువులను వీధిలో విసరివేయించాడు. ఆ వార్త చదివిన తరువాతనే ఆయన అద్దె ఇంట్లో నివసిస్తున్నాడని ప్రజలకు తెలిసింది. కేంద్ర ప్రభుత్వం ఆయనకు ఉచితంగా ఇల్లు యిస్తానని ప్రకటించినప్పటికీ, 94 సంవత్సరాల నందాజీ సవినయంగా తిరస్కరించారు. **తన కోసం ఎవరినీ, ఏనాడూ, ఏమీ ఆశించని, నిష్కామకర్మయోగి నందాజీ.** ఆయన ఈనాడు భౌతికంగామనమధ్య లేకపోయినప్పటికీ ఆయన గడిపిన ఆదర్శనిరాడంబర జీవితం మాత్రం చిరస్మరణీయం. రాజకీయనాయకులు, మంత్రులు

ఆయనను ఆదర్శంగా గైకొనివుంటే, భారతదేశం ఏనాడో ఆశించిన ప్రగతి సాధించి ఉండేది.

## 'ఆంధ్రకేసరి' ప్రకాశం

**"తుపాకులు కాల్చండి! మా శరీరాలలోనికి గుండ్లు పోనివ్వండి"** అని సింహగర్జన చేసి, తన ఎదురురొమ్మును చూపుతూ, మద్రాసు పురవీధులలో ముందుకు నడిచారు ప్రకాశంగారు. 'ఊ! షూట్ చేయండి!'అని పోలీసు అధికారి ఉరిమాడు. 'ప్రకాశం వర్ధిల్లాలి!' అంటూ జనసమూహం చేసిన నినాదాలతో ఆ ప్రాంతమంతా మారుమ్రోగింది. పరిస్థితిని గమనించిన ఆ పోలీసు అధికారి గత్యంతరంలేక ప్రకాశం పంతులుగారిని ముందుకు పోనివ్వడానికి అనుమతిస్తాడు. ఈ సంఘటన జరిగిన తరువాత 'కృష్ణాపత్రిక' వ్రాసిన సంపాదకీయంలో ప్రకాశంగారికి 'ఆంధ్రకేసరి' బిరుదునిచ్చి ప్రశంసించింది. ఆంధ్రరాష్ట్ర ప్రప్రథమ ముఖ్యమంత్రిగా పదవిని, చేపట్టిన ఘనత 'ఆంధ్రకేసరి'కి దక్కింది. బారిష్టర్‌గా లక్షలు ఆర్జించిన ఐశ్వర్యవంతుడు ఆయన. సంపాదించిన సొమ్మును పేదలకు, పార్టీకి ఖర్చుచేసిన త్యాగశీలి. లేమిని ఆహ్వానించి, అనుభవించిన నిస్వార్థసేవా తత్పరుడు. అంత సంపాదించి నప్పటికి అవసాన దశలో కనీస అవసరాలకు కూడా ధనంలేక పేదరికాన్ని అనుభవిస్తూ కూడా ఆదర్శజీవితాన్ని గడిపిన త్యాగశీలి. ఆయన సంపాదించిన స్థిరచరాస్థులను గమనిస్తే, ఆయన చేసిన త్యాగం ఎంతటిదో మనకు బోధపడుతుంది. ఆయన సంపాదించిన ఆస్థులను పరికిస్తే ఎంతటివారికైనా ఆశ్చర్యంవేస్తుంది. **1) ఊటీలో ఒక పెద్దబంగళా 2) మద్రాసులో పెద్దబంగళా 3) రాజమండ్రిలో ఆరువేల చదరపు అడుగుల ఇల్లు 4) రాజమండ్రి సెంట్రల్ జైలు సమీపంలో 100 ఎకరముల భూమి. 5) పశ్చిమ గోదావరి పోణంగిలో 40 ఎకరముల పొలము. 6) రైల్వే షేర్లు ఒక లక్ష 7) గవర్నమెంటు బాండ్లు ఒక లక్ష 8) మద్రాస్ కార్పొరేషన్ డిబెంచర్లు 15 వేల రూపాయిలు. 9) ఆంధ్రా బ్యాంక్ డిపాజిట్లు 50 వేలు ఉండేవి.** స్వాతంత్ర్యపోరాటం కాలంలో ఇవన్నీకరిగిపోయి, ఆయన అవసానదశలో, ఎవరైనా సహృదయులు టిక్కెట్టు కొని యిస్తే, రైలులో ప్రయాణం చేయగలిగే స్థితి ఏర్పడినదంటే ఆశ్చర్యంగానే ఉంటుంది. స్వాతంత్ర్యోద్యమంలో తన సర్వస్వాన్ని త్యాగంచేసి, త్యాగంలోనే ఆనందాన్ని అనుభవించిన త్యాగశీలి ప్రకాశం పంతులు. అయితే ఈనాడు ఆ త్యాగశీలి ఎందరికి గుర్తు ఉన్నాడు? ఆయన చేసిన త్యాగాలు ఎవరికి తెలుసు? ఈ ప్రశ్నలకు సమాధానం లభించడం చాలాకష్టమే! అసలు సమాధానమే లభించదేమో!

ఈ పవిత్రమైన భారతావని చరిత్రపుటలను తిరుగ వేస్తే, ఇంకా..... ఇంకా..... ఎందరో..... ఎందరో..... త్యాగశీలురు కనిపిస్తారు, కర్మయోగులు ప్రత్యక్షమవుతారు. త్యాగధనులకు పుట్టినిల్లు ఈ భారతదేశం. కర్మయోగులకు నిలయం ఈ భారతావని. వారందరినీ గురించి వ్రాస్తే అది ఒక పెద్ద ఉద్గ్రంథమవుతుంది. అంత స్థలం శ్రీవాణి లో లేదుకదా! అందువలన కొందరినే తీసుకొని, వారి జీవితాలలోని కొన్ని ముఖ్య సంఘటనలనే పాఠకులకు ఈ వ్యాసం ద్వారా అందిస్తున్నాను. **ఆనాడు త్యాగరాజులు పెట్టిన స్వాతంత్ర్య భిక్షను, ఈనాడు భోగరాజులు అనుభవిస్తున్నారు.** ఇది మారాలి. మరల ఈ దేశంలో త్యాగరాజులు ఉద్భవించి, స్వర్ణభారతిని నిర్మించాలి. ఆ మహత్తర ప్రయత్నానికి ఈ చిన్ని వ్యాసం ఏమాత్రం తోడ్పడినా చాలు. సంతోషిస్తాను.

భారతమాతాకీ జై!

శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రిగారు చాలా సంవత్సారాలుగా శ్రీవాణి మాసపత్రికలో 'రసవద్ఘట్టాలు' అనే శీర్షికను నిర్వహిస్తున్నారు. ఆ శీర్షిక ద్వారా ఎందరో మహానుభావుల జీవిత చరిత్రలలోని సంఘటనలను "శ్రీవాణి" పాఠకులకు అందిస్తున్నారు. ఆ శీర్షిక ప్రత్యేకంగా పాఠకులను ఆకర్షిస్తున్నది. ఈ వ్యాసం వ్రాయడానికి కూడా ప్రేరణనిచ్చింది, ఆ శీర్షికే. అంతే కాదు ప్రచురించిన ఈ క్రింది పుస్తకములు కూడా ఎంతగానో ఉపకరించాయి. ఈ పుస్తకాలు ప్రతి ఇంట్లో వుండాలి, ప్రతి ఒక్కరూ తప్పని సరీగా చదివితీరాలి.

1. రసవద్ఘట్టాలు - 1/8 డెమ్మీ - రు. 15-00
2. ఎందరో మహానుభావులు - డెమ్మీ - రు. 25-00

( ఈ మధ్యనే ముద్రించబడింది)

**వివరములకు :**

**శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి,**

1/1845, గాంధీనగర్, కడప - 526004.

# భగవంతుడు విత్తమును చూడదు చిత్తమును చూస్తాడు

భగవంతుడు భావప్రియుడేగాని, బాహ్య ప్రియుడు కాదు. నీవు బీదలకు ఎంతయిచ్చావు? ఎన్ని చీరెలు పంచావు? ఎంత అన్నం పెట్టావు? ఎంతమందికి పెట్టావు? వీటన్నింటిని భగవంతుడు చూడడు, పట్టించుకోడు. భగవంతుడు నీ విత్తమును చూడడు, నీ చిత్తమును చూస్తాడు. భగవంతుడు విత్తచోరుడు కాదు, చిత్తచోరుడు. స్వామి కోరేది Quantity కాదు, Quality మాత్రమే చూస్తాడు. కేవలం చిన్న తులసీ దళంతో కృష్ణుని తూచగల్గింది రుక్మిణి. కేవలం పిడికెడు అటుకులు పెట్టి కృష్ణుని అనుగ్రహ ఆశీస్సులను పొందగలిగాడు కుచేలుడు. తెగి రక్తము కారుతున్న కృష్ణుని వ్రేలుకు ఏమాత్రం ఆలోచించకుండా, ఆలస్యం చేయకుండా, తన పట్టుచీరెను చించి ఆ వ్రేలుకు కట్టింది ద్రౌపది. అదే అక్షయమై వలువలనిచ్చి, కష్టకాలంలో ఆదుకొని ద్రౌపది మానాన్ని కాపాడింది. ఎంత యిచ్చావు? అని భగవంతుడు చూడడు. భగవంతుడు చూచేది నీభావమునే. అన్ని అవతారముల యందు చిన్న చిన్నవాటినే, భగవంతునికి హృదయ పూర్వకంగా సమర్పించి, అనంతమైన అనుగ్రహమును పొందగలిగారు భక్తులు. అందువలననే భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు "భగవంతుడు నీ భక్తిని చూస్తాడే గాని, నీశక్తిని చూడడు. నీ గుణమును చూస్తాడేగాని, నీ కులమును చూడడు, నీ నీతిని చూస్తాడేగాని, నీ జాతిని చూడడు. నీ చిత్తమునేగాని నీ విత్తమును చూడడు" అని అన్నారు. కనుక గుణమును పెంచుకోవాలిగాని ధనమును కాదు. భక్తిని పెంపొందించుకోవాలి గాని, భుజబలం కాదు. నీతిని పెంచుకోవాలిగాని జాతి, మత, కుల విభేదాలను, కాదు. భగవంతునికి అందరూ సమానమే. అటువంటి సమైక్యతా భావమును పెంచుకొని, హృదయం నిర్మలం గావించుకున్న వారికే భగవదానుగ్రహం లభిస్తుంది.

జీవితకాలంలో చేసిన దైవస్మరణ అంత్యకాలంలో అక్కరకు వస్తుంది. చాలామంది మేము Enjoy చేస్తున్నా మంటారు. ఈ Enjoy ప్రాకృతమైనది, క్షణభంగుర మైనటువంటిది: కాని End-joy శాశ్వతమైనటువంటిది కాబట్టి మనం కోరుకోవలసింది Enjoy మాత్రమే కాదు. End-joy ని కోరుకోవాలి. దీని కోసం ప్రాణం వున్నంతవరకు భగవత్ చింతన చేయాలి. కేవలం చింతన చేసి ప్రయోజనం లేదు. దైవకార్యములలో కూడా పాల్గొనాలి. చింతన మనసుతో చేయాలి. కార్యం కాయంతో చేయాలి. **'నాలుక మీద నామం నాట్యం చేస్తుంటే, చేతులతో సమాజసేవ చేయండి"** అన్నారు భగవాన్ సాయి.

కనుక భగవత్ చింతన, సమాజసేవ ఆ రెండింటి వలననే భగవదానుగ్రహమును పొందగలుగుతామని శ్రీకాకుళం జిల్లా సోంపేటలో ది. 9-7-2000న జరిగిన 'యువజాగృతి సమ్మేళనం'లో పాల్గొని శ్రీవాణి ఎడిటర్ కొమరగిరి ప్రసంగించారు. భగవాన్ శ్రీ సత్యసాయి సేవా సమితి ఆధ్వర్యమున జరిగిన ఈ సమ్మేళనంలో వందలాది మంది యువకులు మరియు సాయి భక్తులు పాల్గొనినారు. కన్వీనర్ టి. బాపూజీ వందన సమర్పణ చేశారు. తదుపరి సాంస్కృతిక కార్యక్రమాలు కూడా జరిగాయి.

**- భరద్వాజ్**

## జర్మనీ ప్రభుత్వ కార్యాలయంలో ఆంధ్రుని చిత్రపటం

**శ్రీమతి ఇందిరా గాంధీ ప్రధాన మంత్రిగావున్న కాలంలో భారతదేశమునుండి ప.జర్మనీకి ఒక ప్రముఖుడు రాయబారిగా వెళ్ళాడు. అక్కడి అధికారులు, ఆ రాయబారికి తమ కార్యాలయా లను చూపుతూ, అక్కడగల ఒక భారతీయుని చిత్రపటం చూపుతూ 'ఈయన ఎవరో? మీకు తెలుసా' అని అడుగు తారు. తనకు తెలియదంటాడు ఆ రాయబారి. అప్పుడు ఆ జర్మన్ అధికారులే ఆ ఫొటోలోని వ్యక్తి పేరు చెప్పి, అతని గురించి ఈ విధంగా వివరిస్తారు.**

**ఆ ఫొటోలోని వ్యక్తి పేరు శ్రీ దండిభట్లు విశ్వనాధ శాస్త్రి, రాజమండ్రి సంస్కృత మహాపండితులు. యజుర్వేదం దానికి కర్మకాండపరంగా, తాంత్రిక విద్యాపరంగా, ఆధ్యాత్మికంగా, వైజ్ఞానికంగా ఈ నాలుగు విధాలుగా అర్థం చెప్పగలిగిన మేధావి. 1938వ సం॥లో జర్మన్ గూఢచారులు ఇండియావచ్చి ఆయనను జర్మనీకి గొనిపోయారుట వేదశాస్త్రములలోగల వైజ్ఞానిక విషయాలను వీరినుండి జర్మన్ శాస్త్రవేత్తలు గ్రహించి, యుద్ధకాలం లో ఆయుధ నిర్మాణానికి వాటిని వినియోగించుకున్నారుట. వీరి యెడల కృతజ్ఞతా సూచకంగా, వీరి చిత్రపటాన్ని తమ విదేశాంగ శాఖ కార్యాలయంలో పెట్టుకున్నారు. దీనిని బట్టి వేదాల విశిష్టత, ముఖ్యంగా యజుర్వేదం యొక్క ఘనత ఎట్టిదో అర్థమవుతున్నది.**

**(శ్రీ జి.పుల్లారెడ్డిగారి అభినందన సంచిక నుంచి)**

# ప్రేమ కుటీరములో ప్రేమ ప్రవాహము

11-6-2000వ తేదీన భగవాన్ బాబావారు బాగేపల్లిలోని శ్రీ సత్యసాయి సర్వ ధర్మ సమన్వయ ట్రస్ట్ ద్వారా నిర్వహింపబడుతున్న వృద్ధాశ్రమము, ప్రేమ కుటీరమును మరొక్క సారి తమ దివ్య పాదస్పర్శతో పునీతము గావించారు. 1996వ సంవత్సరం జూన్ 7వ తేదీన భగవాన్ బాబావారిచే ప్రారంభించబడిన ఈ వృద్ధాశ్రమము (ప్రేమకుటీరము) దినదినాభివృద్ధి చెందు చున్నది. ఈ ఆశ్రమము ప్రార్థనామందిరము, భోజనాలయము మరియు కొన్ని కుటీరములతో కూడి యున్నది. ఇప్పుడు నూతనంగా నిర్మింపబడిన శ్రీ మహాగణపతి దేవాలయము, వృద్ధుల వసతి గృహము మరియు గోశాలలను భగవాన్ బాబావారు 11-6-2000వ తేదీన తమ దివ్య హస్తములతో ప్రారంభించినారు.

బృందావనము నుండి విచ్చేసిన స్వామివారిని పూర్ణకుంభము, వేదపఠనము మరియు బాలవికాస్ పిల్లల నృత్యముతో స్వాగతించారు. కారునుండి దిగిన స్వామి నేరుగా శ్రీ మహాగణపతి దేవాలయమును ప్రవేశించారు. ఆ సమయమున ఇరుపక్కలా ఉన్న కొంత మంది భక్తులను పలకరించి, విభూతి ప్రసాదమును ప్రసాదించి అనుగ్రహించారు. గర్భగుడిని ప్రవేశించిన స్వామివారు శ్రీ మహాగణపతి విగ్రహమును స్పర్శించి, అక్షింతలను వేసి విగ్రహ ప్రతిష్ఠాపన చేశారు. స్వామివారు తరువాత యజ్ఞశాలను ప్రవేశించి అజ్యసమిధులను యజ్ఞ కుండములో సమర్పించి, యజ్ఞపురుషుడుగా పూర్ణాహుతిని స్వీకరించారు. ఆ తరువాత వృద్ధుల వసతి గృహమును ప్రారంభించుటకు వెళ్ళుచున్నప్పుడు మార్గమున షామియానా క్రింద కూర్చొని యున్న ఐదు వేలకు పైగానున్న భక్తులలో కొందరిని పలుకరిస్తూ, కొందరికి పాద నమస్కారమిస్తూ, కొందరి వైపు చిరునవ్వు చిందిస్తూ, కొందరిని తమ అభయ హస్తముతో ఆశీర్వదిస్తూ స్వామి అందరినీ ఆనందభరితులు గావించారు. వసతి గృహమును ఉద్ఘాటించి, లోపల మహిళలకు, పురుషులకు ప్రత్యేక వసతిని చూసి స్వామి సంతోషించారు.

తరువాత స్వామి వేదికను ప్రవేశించారు. స్వామి తమ చిన్ననాటి కాలములో పాడుతున్న పాటలను శ్రీమతి విద్యా మరియు బృందము గానం చేస్తున్నది విని స్వామి చాలా సంతోషించారు మరియు వారిని ఆశీర్వదించారు. తరువాత స్వామి ప్రఖ్యాత శాస్త్రవేత్త శ్రీ శ్రీకంఠయ్యగారిని కొద్దిసేపు సభనుద్దేశించి మాట్లాడమన్నారు. స్వామి

వై. శ్రీనివాసరెడ్డి

ఆయనకు వజ్రపుటుంగరమును సృష్టించి యిచ్చి అనుగ్రహించారు. ఆ తరువాత శ్రీ శ్రీనివాసరెడ్డిగారిని మాట్లాడమన్నారు. ఆయన మాట్లాడుతూ, 'స్వామి సేవా ప్రియులు, మనము స్వామికి దగ్గర కావాలంటే సేవ యొక్కటే సులభమైన మార్గము' అని అన్నారు. మరియు నిరంతరమూ తమను స్వామి పనిముట్టులుగా వాడుకొని పునీతులు గావించవలెనని ప్రార్థించారు. ఆయనకు స్వామి నవరత్నాల ఉంగరమును సృష్టించి యిచ్చి అనుగ్రహించారు. ఆ తరువాత స్వామి తమ దివ్య సందేశముతో భక్తులను అనుగ్రహించారు.

'న తపాంసి న తీర్థాని నశాస్త్రాణి జపా నహి
సంసార సాగరోత్తారో సజ్జనం సేవనం వినా'

'మానవ జన్మ సౌజన్యమూ, సౌశీల్యమూ, పవిత్రమూ, దుర్లభమూ అయినటువంటిది. ఇది జీవించ దగినటువంటిది. అనేక జన్మల పుణ్య ఫలముతో లభించిన ఇట్టి జన్మను, దానియొక్క విలువను తెలుసుకోకుండా మానవుడు దుర్వినియోగపరచుకుంటున్నాడు. ఇట్టి జన్మను సార్థకపరచుకోవడానికి మానవుడు తగిన కృషి చేయాలి.

మానవుడు సేవ చేయడానికే జన్మించినాడు, పశు పక్షి మృగములవలె సుఖ భోగములను అనుభవించుట కొరకు కాదు. ప్రతి మానవుడూ సేవకుడే కాని నాయకుడు కాదు. తల్లి బిడ్డకు సేవకురాలు, బిడ్డ తల్లికి సేవకుడు, భార్య

భర్తకు సేవకురాలు, భర్త భార్యకు సేవకుడు. సేవ లేకుండా జీవించుటకు సాధ్యం కాదు. కనుక మనము కష్టములో ఉన్న తోటి మానవులకు సహాయము చేసి మన జన్మను సార్ధక పరచుకోవడానికి ప్రయత్నించాలి. ఈ మార్గము నందు, ఏ విధమైనటువంటి సదుపాయములూ లేనటు వంటి ఈ ప్రదేశమునందు ఈ ఒక్క కుటుంబము ఇన్ని రకములైనటువంటి సదుపాయములను కల్పించి, అనాధు లైన వృద్ధులకు ఆశ్రయము కల్పించినారు. ఈ విధమైన సేవలోనే మానవుని సార్ధకత ఉంటుంది. త్యాగము లేని జీవితము వ్యర్ధమౌతుంది.

సమాజ సంక్షేమాన్ని కోరి తోటి మానవునికి సేవ చేయటము వల్ల మానవత్వానికి ఘనత కలుగుతుంది. ఏదో చదువుకొని, విదేశాలకు పోయి డబ్బు సంపాదించడం వల్ల కాదు. మీకు తెలుసు, కృష్ణ తులాభారంలో సత్యభామ కృష్ణున్ని డబ్బుతో పొందాలని ప్రయత్నించింది భగవంతుడు ధనమునకు తూగడు, ఒక్క ప్రేమకే తూగుతాడు. అతి విలువైనటువంటి శమంతకమణికి కూడా తూగలేదు. కాని, రుక్మిణి వచ్చి, 'పత్రమో, పుష్పమో, ఫలమో, తోయమో, భక్తి కలిగినవారికి వశమగుట సత్యమేని నీవీ తులసీ దళముకు తూగుదువుగాక' అని భక్తితో ఒక తులసీదళమును వేసింది. వెంటనే కృష్ణుడు సరి తూగినాడు.

కనుక, భగవంతుడు ఒక్క ప్రేమకు మాత్రమే లభ్యమౌతాడు. డబ్బు వస్తుంది, పోతుంది. ప్రేమ వస్తుంది, పెరుగుతుంది. కనుక అలాంటి పెరిగే ప్రేమను పెంచు కోండి.

ఏ విధమైన సదుపాయములు లేనటువంటి ఈ ప్రదేశమందు ఈ ఒక్క కుటుంబం ఇన్ని సదుపాయములు కల్పించింది. ఇది ఇంకా ఎంతో అభివృద్ధి కావాలి. దానికి నేను కూడా తోడుగా ఉంటాను. ఏమి కావలసినా నేను చేస్తాను. ఇక్కడ పశువుల కోసం గోశాలను కట్టారు. అనాధులైన వృద్ధుల కోసం వృద్ధాశ్రమము స్థాపించారు. కానీ, పిల్లలు చదువుకోడానికి ఒక విద్యాలయము కూడా ఉండాలి. అది నేను చేస్తాను. ఇలాంటి అభివృద్ధి కార్యక్రమములలో పాల్గొన్ని జీవితాన్ని సార్ధక పరచుకోవాలని నేను ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను అన్నారు. తరువాత స్వామి వారు పుట్టపర్తి బయలుదేరి వెళ్ళారు.

# పదాల పందిరి - 29

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | | * | 2 | * | 3 | 4 |
| | * | 5 | | 6 | * | |
| 7 | | | * | 8 | | |
| * | * | | * | | * | * |
| 9 | | | * | 10 | | 11 |
| | * | 12 | 13 | | * | |
| 14 | | * | | * | 15 | |

## ఆధారాలు

**అడ్డం :**

1. కాలు
3. సన్నాయి కాదు, బూర
5. సంతోషం
7. పడతి పాదాలకు అందం
9. త్యాగము అటునుంచీ
10. వెండి
12. ఆ ప్రక్కన పగలు
14. చలికాలపు దుప్పటి
15. మూడు గంటల కాలము

**నిలువు :**

1. శకుని పాచిక తలక్రిందులైంది
2. పాట 'పాడటం'
4. ఒకనది, ఉత్తర భారతంలోనిది
5. శ్రీవాణిలోని ఒక శీర్షిక
6. అడ్డం 5లోది ఎక్కువై తలక్రిందులైంది.
9. ముక్కుకు అలంకారం
11. మంత్రం కాదు
13. గొంతు

- కిరీటి

## పదాల పందిరి -28 సమాధానాలు

అడ్డం : 1.. నీతి 3. శ్రమ 5. సంబరం 7. జలగ 9. తిమిరం 10. లలితం 12. గంధము 14. లుక్కు 15. చెర

నిలువు : 1.నీరజ 2. రొంబ 4. మరాళం 5. సంగరోరంగం 6. రంగస్థలము 9. తిలలు 11. తంబుర 13. ధర

# రాష్ట్రపతి పదవినలంకరించిన రైతుబిడ్డ

కరువు కాటకాలకూ వెనుకబడినతనానికి ప్రతి రూపమయిన ఒక జిల్లాలోని ఒక మామూలు గ్రామంలో సామాన్య రైతు కుటుంబంలో జన్మించిన వ్యక్తి రాజకీయ రంగంలో అంచెలంచెలుగా ఎదిగి దేశంలోనే అత్యున్నతమైన రాష్ట్రపతి పదవిని పొందడం ఒక సామాన్య వ్యక్తి ఎవరెస్ట్ శిఖరం అధిరోహించినంతటి ఘనవిజయం. ఆ విజయాన్ని సాధించిన రైతుబిడ్డ నీలం సంజీవరెడ్డి.

రాయలసీమ అనంతపురం జిల్లాలోని తరిమెల గ్రామంలో సంజీవరెడ్డి జన్మించారు. ఆయన బడికి వెళ్లి ఓనమాలు దిద్దుకుంటున్న సమయంలో రాయలసీమతో సహా దేశమంతటా మహాత్మాగాంధీ పిలుపునందుకుని జాతీయ భావ ప్రభంజనంలో తేలిపోతూ ఉంది. అనంతపురం జిల్లా దేశభక్తులకు అవతార పురుషులకు నిలయం. గత శతాబ్దంలో గూనిగుంపన్న అనే సామాన్య రైల్వే గేట్ మ్యాన్ తప్పత్రాగిన బ్రిటీష్ సైనికులు ఒక యువతిని బలాత్కారం చేయబోతూఉంటే వారిని అడ్డుకుని ప్రాణాలను పోగొట్టుకున్న అమరజీవి. కేశవపిల్ల గొప్ప దేశభక్తుడు, జాతీయాభిమాని. హరిజనాభ్యుదయం కోసం పోరాడిన సంస్కరణ వాది. మహాత్మాగాంధి పిలుపు నందుకుని రాయలసీమ నుంచి స్వాతంత్ర్య సమరంలో దుమికిన తొలి వీరులలో అనంతపురం జిల్లాకు చెందిన కృష్ణార్జునులు వంటి కల్లూరు సుబ్బారావు, పప్పూరి రామాచార్యులు, గాడిచర్ల హరిసర్వోత్తమరావులు ఉన్నారు.

సంజీవరెడ్డి నాన్నగారు పప్పూరి రామాచార్యులు గారిని పిలిచి "మా పిల్లలకు చదువు చెప్పండి" అని పురమాయించారు. నిష్కళంక దేశభక్తుడు, పత్రికా (శ్రీ సాధన) సంపాదకుడయిన రామాచార్యులుగారు ఈ పిల్లలకు చదువుతో పాటు దేశభక్తిని రంగరించి పోశారు. ఆయన శిష్యులలో సంజీవరెడ్డి, ఆయన సోదరుడు రాజశేఖర రెడ్డి, వారి బావమరిది తరిమిల భాగిరెడ్డి ఉన్నారు.

వారి సహోధ్యాయి విద్వాన్ విశ్వంగా ప్రసిద్ధుడయిన విశ్వరూపాచారి. ఆ విధంగా వీరు దేశభక్తియుత వాతావరణంలో పెరిగారు. సంజీవరెడ్డి గాంధీయ ప్రభావానికి లోనయి కాంగ్రెస్‌లో ప్రవేశించి అంచెలంచెలుగా ఎదిగారు. రాజశేఖరరెడ్డి, నాగిరెడ్డి. మార్క్సిస్టు భావ ప్రభావితులయి అగ్రశ్రేణి కమ్యూనిష్టు నాయకులయ్యారు. రాజశేఖరరెడ్డి రాష్ట్ర సి.పి.ఐ. ప్రధాన కార్యదర్శిగా పనిచేసి సి.పి.ఐ. అగ్రనాయకులలో ఒకరు కాగలిగారు. నాగిరెడ్డి ప్రముఖ నక్సలైటు నాయకుడిగా పరివర్తన చెంది అజ్ఞాత వాసం చేస్తూ అజ్ఞాతంగానే మారుపేరుతో ఉస్మానియా ఆసుపత్రిలో మరణించారు. మరణించిన వ్యక్తి నాగిరెడ్డి అని తర్వాత కాని తెలియలేదు. విశ్వం మార్క్సిస్టు గాంధీయ భావాలను సమానంగా తనలో మేళవింపు చేసుకుని కవిగా, పత్రికా సంపాదకునిగా తరగని కీర్తిని మూట కట్టుకున్నారు.

**కంచి వాసుదేవరావు**

1946 నాటికే సంజీవరెడ్డి జిల్లా స్థాయినుంచి రాష్ట్ర స్థాయి కాంగ్రెస్ నాయకునిగా ఎదిగారు. 1946లో సమిష్టి మద్రాస్ రాష్ట్ర శాసనసభకు ఎన్నికలు జరిగే నాటికి ఆంధ్ర పి.సి.సి. సహాయ కార్యదర్శి పదవిలో ఉన్నారు. మద్రాస్ శాసనసభకు అనంతపురం నియోజక వర్గం నుంచి ఎన్నికయ్యారు. 1948 - 52ల మధ్య మద్రాస్ రాష్ట్రాన్ని పాలించిన ఓమాంటూరు రామస్వామి రెడ్డి కుమారస్వామి రాజా మంత్రివర్గ సభ్యునిగా పనిచేశారు అప్పటికే ఆయనకు, తనకు సీనియర్లు అయిన రాయలసీమ నాయకులను వెనక్కి నెట్టి ముందుకు దూసుకు వెళ్ళారు.

సంజీవరెడ్డి రాజకీయ జీవితాన్ని సమీక్షించినప్పుడు రాష్ట్ర కేంద్ర రాజకీయాలు ఒక మలుపు తిరిగినపుడు ఆ మలుపునకు ఆయన కేంద్రబిందువు కావడాన్ని గమనిస్తాం.

ఆ రోజులలో రాష్ట్ర కాంగ్రెస్‌లో డా॥ పట్టాభి, ప్రకాశం, ఆచార్య రంగాల పేర్లతో మూడు వర్గాలు ఉండేవి. పట్టాభి వర్గం రాష్ట్ర కాంగ్రెస్‌లో అధికార వర్గంగా ఉండగా ప్రకాశం రంగా వర్గాలు అసమ్మతి వర్గాలుగా ఉండేవి. ప్రకాశం, రంగా వర్గాలు అధికార వర్గానికి (మంత్రి పదవులను

అలంకరించినవారికి) వ్యతిరేకంగా అనుక్షణం పని చేస్తూ ఉండేవి. అధికార అసమ్మతి వర్గాలు అదును దొరికి నప్పుడల్లా బలపరీక్షలు జరుపుకుంటూ పార్టీపైన ప్రభుత్వం పై ఆధిపత్యానికి పోరాడుతూ ఉండేవి.

**రాష్ట్ర రాజకీయాలలో కీలక మలుపు :**

ఆ బలాబలాల పరీక్ష పి.సి.సి. అధ్యక్ష పదవికి జరిగే ఎన్నికలలో వ్యక్తమయ్యేవి. 1950-51 ప్రాంతంలో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్ష పదవికి తీవ్ర స్థాయిలో పోటీ జరిగింది. అధికార వర్గం తరుపున సంజీవరెడ్డి నిలిచారు. అసమ్మతి వర్గం తరపున ఆచార్య రంగ నిలిచారు. అంతకు పూర్వం రెండుసార్లు జరిగిన ఎన్నికల్లో రంగా సంజీవరెడ్డిని ఓడించారు. ఈసారి ఎన్నిక మరింత తీవ్రస్థాయిలో అత్యంత ఉద్రేకభరితమైన వాతావరణంలో జరిగింది. కాంగ్రెస్ అధిష్ఠాన వర్గం పరిశీలకునిగా కె.ఎస్. పాటిల్ వచ్చారు. హోరాహోరీగా జరిగిన పోటీలో సంజీవరెడ్డి ఐదు ఓట్ల స్వల్ప మెజారిటీతో గెలిచారు. ఆ ఎన్నికలలో అక్రమాలు జరిగాయని వివాదాస్పదమైన ఓట్లు సంజీవరెడ్డికి పోగయ్యాయని ఆరోపిస్తూ ప్రకాశం రంగాలు కాంగ్రెస్‌ను చీల్చి ప్రజా పార్టీని స్థాపించుకున్నారు. ఆ తర్వాత ప్రజా పార్టీలోని ప్రకాశం వర్గం ఆచార్య కృపలానీ నాయకత్వంలోని కిసాన్‌మజ్దూరి పార్టీలో విలీనం అయింది. ఆ తర్వాత ఆ పార్టీ సోషలిస్ట్ పార్టీ కలసి ప్రజా సోషలిస్ట్ పార్టీగా రూపొందాయి. ఆచార్య రంగాగారి మజ్దూరీ పార్టీలో విలీనం కాగా కృషీకర్‌కాత్యా పార్టీ అనే సొంత పార్టీని పెట్టుకుని ఆ తర్వాత దాన్ని రాజాజీ నాయకత్వంలో ఏర్పడిన స్వతంత్ర పార్టీలో విలీనం చేశారు. చివరకు యిద్దరు నాయకులు తిరిగి కాంగ్రెస్‌లో చేరారు. ఏమయితేనేం 1950 దశకంలో రాష్ట్ర రాజకీయాలను ఒక మలుపుతిప్పిన ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ చీలిక ఉదంతానికి సంజీవరెడ్డి కేంద్ర బిందు వయ్యారన్నది నిజం.

పొట్టి శ్రీరాములు ఆత్మబలిదానం వలన కర్నూలు రాజధానిగా ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం 1953లో ఏర్పడినప్పుడు తొలి ముఖ్యమంత్రి పదవిని వయోవృద్ధుడైన ఆంధ్ర కేసరి ప్రకాశంగారికి హృదయపూర్వకంగా అప్పగించి ఉప ముఖ్యమంత్రి పదవితో తృప్తిపడ్డారు.

ప్రకాశం ప్రభుత్వ పతనానంతరం 1955లో జరిగిన మధ్యంతర ఎన్నికలలో కాంగ్రెస్‌దాని మిత్రపక్షాలు భారత కమ్యూనిస్టు పార్టీని చిత్తుగా ఓడించినప్పుడు అధిష్టానవర్గం ముఖ్యమంత్రిగా బెజవాడ గోపాలరెడ్డిని నిర్ణయించగా సంజీవరెడ్డి దానికి హుందాగా అంగీకరించారు.

1956 నవంబరు 1వ తేదిన ఆంధ్రప్రదేశ్ అవతరించినప్పుడు అధిష్టానవర్గం ఆశీస్సులతో ఆయన తొలిముఖ్యమంత్రి అయ్యారు. ఆ విధంగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన కీలక సమయంలో ఆయన రాష్ట్ర రాజకీయాలకు కేంద్రబిందువయ్యారు. సంజీవరెడ్డి వంటివారి సేవలు రాష్ట్రానికి పరిమితంకారాదని ఆనాటి ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూ భావించి కాంగ్రెస్ అధ్యక్ష పదవిని స్వీకరించమని కోరినప్పుడు సంజీవరెడ్డి క్షణమయినా ఆలోచించకుండా ముఖ్యమంత్రి పదవికి రాజీనామాచేసి పార్టీ అధ్యక్షపదవిని చేపట్టారు. ఆ హోదాలో ఆయన రాజకీయపార్టీలన్నిటికీ శిరోధార్యమైన ఒక అమూల్యమైన సూచన చేశారు. ఏ రాజకీయ నాయకుడు వరుసగా ఏ పదవిలోనూ రెండు టరమ్‌లకు మించి ఉండరాదన్నదే ఆ సూచన. దాన్ని తదితర కాంగ్రెస్ నాయకులు కాని దాదాపు గా యితర రాజకీయ పార్టీలుకాని పట్టించుకోలేదు. ఆ సిఫార్సుకు అనుగుణంగా నడచివుంటే దేశ రాజకీయాలలో ఇంతటి కుళ్ళు జేరివుండేదికాదు.

1962లో జరిగిన ఎన్నికలలో సంజీవరెడ్డి తిరిగి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి అయ్యారు. పి.వి. నరసింహారావు,

పి.వి.జి. రాజు, చల్లపల్లి రాజా, తోట రామస్వామి వంటి వారిని తొలిసారి మంత్రివర్గంలో చేర్చుకుని తన మంత్రి వర్గానికి కొత్త జవసత్వాలు చేకూర్చారు.

**నైతిక విలువలకోసం ముఖ్యమంత్రి పదవికి రాజీనామా :**

1954లో కర్నూలు జిల్లా బస్సుల జాతీయకరణపై ఆంధ్రప్రదేశ్ హైకోర్టు రాష్ట్ర ప్రభుత్వం (ముఖ్యమంత్రిపై కాదు) ఒక చిన్న ప్రతికూల వ్యాఖ్యను చేసినందుకు స్పందిస్తూ రాష్ట్ర ప్రభుత్వాధినేతగా ఆ పొరపాటుకు తన నైతిక బాధ్యతను స్వీకరిస్తూ ముఖ్యమంత్రి పదవిని ఒక్క క్షణమయినా ఆలోచించకుండా ఎవరూ కోరకపోయినా రాజీనామాచేసి తన అత్యున్నతమైన నైతిక విలువలను చాటుకున్నారు. న్యాయస్థానాలు ఎన్ని విధాలుగా మందలించినా కోర్టులో ఛార్జి షీట్లు దాఖలయినా "రాజ్యాంగంలో రాజీనామా చేయాలన్న నిబంధనలేదు. నేనెందుకు రాజీనామా చేయాలి? ఛార్జిషీటు దాఖలు చేసినంతమాత్రాన నేను దోషినవుతానా. ఈ కోర్టుకన్న పెద్దది ప్రజాకోర్టు. వారి ముందుకే వెళ్తాను" అని నిర్లజ్జగా ప్రకటించే రాజకీయ నాయకులతో పోలిస్తే సంజీవరెడ్డి ఎంత ఉన్నతుడో అర్థం అవుతుంది.

లాల్‌బహదూర్‌శాస్త్రి మంత్రి వర్గంలో సంజీవరెడ్డి ఉక్కుగనుల శాఖను స్వీకరించారు. 1967 లో లోక్‌సభకు జరిగిన ఎన్నికలలో ఆయన కాంగ్రెస్ టిక్కెట్టుపై గెలిచారు. కాంగ్రెస్ పార్టీ ఆయనను స్పీకర్ పదవికి తన అభ్యర్థిగా ఎంపిక చేసింది. ప్రతిపక్షాల ఉమ్మడి అభ్యర్థిగా తెన్నేటి విశ్వనాధం నిలిచారు. సంజీవరెడ్డి గెలిచారు. వెంటనే లోక్‌సభ స్పీకర్ పదవి అన్ని రాజకీయ పార్టీలకు సంబంధించినదని అందువలన స్పీకర్ ఏ రాజకీయ పార్టీకి చెందినవారుగా ఉండరాదని వాదిస్తూ తన కాంగ్రెస్ సభ్యత్వానికి రాజీనామా చేశారు. ఈ సాంప్రదాయాన్ని స్పీకర్లు పాటించివుంటే స్పీకర్లు అధికార పార్టీని క్లిష్టకాలంలో తమ రూలింగ్‌లతో రక్షించే దుష్ట సాంప్రదాయం ఏర్పడి వుండేదికాదు. సంజీవరెడ్డి న్యాయశాస్త్ర నిపుణుడుకాదు. గొప్ప భాషాపండితుడుకాదు. అటువంటి వ్యక్తి లోక్‌సభను ఎల్లా నిర్వహించుకురాగలరన్న అనుమానాన్ని కొన్ని వర్గాలు వ్యక్తం చేసినప్పుడు వాటినన్నింటినీ ఆయన త్వరలోనే పటాపంచలు చేశారు. ప్రతిపక్షాలు సైతం ప్రశంసించే విధంగా ఆయన తన బాధ్యతలను నిర్వర్తించారు.

**నైతిక విలువల పతనానికి రాచబాట :**

1969లో దేశరాజకీయాలను నైతిక భ్రష్టత వైపునకు మలుపుతిప్పిన సంఘటన జరిగింది. 1967లో రాష్ట్రపతిగా ఎన్నికయిన డా॥ జాకీరు హుస్సేన్ 1969 మే నెలలో ఆకస్మికంగా మరణించారు. రాష్ట్రపతి పదవికి తొలిసారి ఉపఎన్నిక జరిగింది అప్పటికి కాంగ్రెస్ ప్రధాన మంత్రి ఇందిరాగాంధీ వర్గం ఆమె ప్రాబల్యం పెరగకుండా అడ్డుకునేందుకు అప్పటి కాంగ్రెస్ అధ్యక్షుడు నిజలింగప్ప, కామరాజు, యస్.కె. పాటిల్, మొరార్జీ దేశాయి నాయకత్వంలో వున్న సిండికేటు వర్గం తరచు ఢీకొంటూ వుండేది. రాష్ట్రపతి ఎన్నికకు కాంగ్రెస్ అభ్యర్థిని ఎంపిక చేసేందుకు బెంగుళూరులో నిజ లింగప్ప నాయకత్వంలో సమావేశమైన కాంగ్రెస్ పార్లమెంటరీ సమావేశంలో ఇందిరాగాంధీ ప్రతిపాదించిన జగజీవనరాంను సిండికేటు ప్రతిపాదించిన సంజీవరెడ్డి ఒక్కఓటు తేడాతో ఓడించారు. మెజార్టీ నిర్ణయాన్ని శిరసావహిస్తున్న ఇందిరాగాంధి ప్రకటించి సంజీవరెడ్డి తరఫున నామినేషన్ దాఖలు చేసినా, కాంగ్రెస్ వారిలో అంతరాత్మ ప్రబోధం అనే కొత్త సూత్రాన్ని ప్రవేశపెట్టి రాష్ట్రపతి పదవికి ఇండిపెండెంటుగా పోటీచేస్తున్న అప్పటి ఉపరాష్ట్రపతి వి.వి. గిరికి అనుకూలంగా కాంగ్రెస్ లోని తన అనుయాయులచే ఓటు వేయించి అధికార కాంగ్రెస్ అభ్యర్థిని తన పార్టీ అభ్యర్థినితోనే ఓడించింది. దేశ రాజకీయాలలోనే కాదు ప్రపంచ రాజకీయాలలో సైతం తన పార్టీ అభ్యర్థినితోనే ఓడించిన ప్రధానమంత్రి మరొకరు వుండకపోవచ్చు. ఈ సంఘటన దేశరాజకీయాల నైతిక పతనానికి రాజమార్గం చూపింది. అప్పుడు ప్రారంభమైన నైతిక పతనం కాంగ్రెస్‌నేకాక దాదాపుగా అన్ని రాజకీయ పార్టీలకు వైరస్‌గా వ్యాపించి ఇంకా కొనసాగుతూ వుంది. ఆ విధంగా దేశరాజకీయాలను ఒక చెడు మలుపు త్రిప్పిన సంఘటనలో సంజీవరెడ్డి ప్రధాన పాత్రధారి అయ్యారు. ఆ తర్వాత 1977 వరకు సంజీవరెడ్డి క్రియాశీలక రాజకీయాలకు దూరంగా వుండి పోయారు. 1971 ఎన్నికలలో గ్రాండ్ ఎలయన్స్ అభ్యర్థిగా పోటీచేసి ఆయన ఓడిపోయారు. 1977లో జనతా ప్రభంజనం ఉత్తర భారతదేశంలో బలంగా వీచినందువల్ల ఇందిరాగాంధితో సహా ఆ ప్రాంత కాంగ్రెస్ నాయకులందరూ ఓడిపోయారు. అయితే జనతా ప్రభంజనం వింధ్య పర్వతాలుదాటి దక్షిణాది రాష్ట్రాలకు వ్యాపించింది. ఆంధ్రప్రదేశ్‌లో ఇందిరాగాంధీ నాయకత్వానికి ఎదురులేకపోయింది. 42 లోక్‌సభ

సీట్లకుగాను కాంగ్రెస్ 41 సీట్లు గెలుచుకుంది. నంద్యాల నుంచి సంజీవరెడ్డి ఒక్కడే జనతా అభ్యర్థిగా గెలిచారు.

1977లో రాష్ట్రపతి పదవికి జరిగిన ఎన్నికలలో జనతా పార్టీ తన అభ్యర్థిగా నిలిపింది. అయితే అందుకు సంజీవరెడ్డి అంగీకరించలేదు. గెలవగలిగిన మెజారిటీవున్నా ప్రధాన ప్రతిపక్షమైన కాంగ్రెస్‌తోసహా అన్ని రాజకీయ పార్టీలు ఏకగ్రీవంగా తనని ఎంపిక చేస్తేనే అంగీకరిస్తానని ఏవొక్క పార్టీ అభ్యంతర పెట్టినా పోటీచేయనని ఖచ్చితంగా చెప్పారు. దాంతో అన్ని పార్టీలు సంజీవరెడ్డి అభ్యర్థిత్వానికి అంగీకరించారు. సంజీవరెడ్డి ఏకగ్రీవంగా ఈ అత్యున్నత పదవికి ఎన్నికయ్యారు. 1969లో ఆ సంజీవరెడ్డిని తను పనిగట్టుకుని ఓడించింది, అదే సంజీవరెడ్డి 1977 ఎన్నికలలో రాష్ట్రపతి కావడానికి ఇందిరాగాంధీ గెలిపించడం గొప్ప విషయం. జనతా ప్రభుత్వం విచ్ఛిన్నం తర్వాత 1980లో లోక్‌సభకు జరిగిన మధ్యంతర ఎన్నికలలో కాంగ్రెస్ ఇందిరాగాంధీ నాయకత్వంలో ఘనవిజయం సాధించింది. ప్రధానమంత్రిగా ఇందిరాగాంధిచేత సంజీవరెడ్డి ప్రమాణం చేయించారు. 1982లో రాష్ట్రపతి పదవి నుంచి వైదొలగిన తర్వాత తన జీవితాంతం రొచ్చు రాజకీయాలకు దూరంగా వుంటూ తన అధిష్టించిన అత్యున్నత పదవి గౌరవాన్ని పరిరక్షిస్తూ వచ్చారు.

**చేదు అనుభవాలు :**

ఐతే సంజీవరెడ్డి రాజకీయ జీవితంలోకూడా కొన్ని చేదు అనుభవాలు వున్నాయి. విధానసభ, లోక్‌సభకు జరిగిన ఎన్నికలలో ఓడిపోయిన చేదు అనుభవం అనేక మంది రాజకీయనాయకుల మాదిరి సంజీవరెడ్డికీ తప్పలేదు. 1952 విధానసభకు జరిగిన ఎన్నికల్లో తన బావమరిది తరిమెల నాగిరెడ్డి చేతిలో ఓడిపోయారు. ఒకప్పుడు తనకు అత్యంత ఆప్తులూ సన్నిహితులూ అయిన అల్లూరు సత్యనారాయణరాజు, కాసు బ్రహ్మానందరెడ్డిలు తర్వాత కాలంలో బద్ధశత్రువులు అయ్యారు. 1966లో విశాఖ స్టీలు ఉద్యమం ఉధృతంగా సాగుతున్న రోజులలో విజయవాడలో ఆందోళనకారులు ఏలూరు కాలవ సెంటర్‌లో ఉన్న సంజీవరెడ్డి కాంస్య విగ్రహాన్ని పెకలించి ఏలూరు కాలువలో పారేశారు. పోలీసులు మౌన సాక్షులుగా ఉండిపోయారు. దీని వెనుక ఆయన రాజకీయ ప్రవృద్ధుల ప్రోత్సాహం ఉంది. ఇది ఎవరికయినా మరచిపోలేని చేదు అనుభవమే. సంజీవ రెడ్డి ప్రతిపక్షనాయకులను ఎంతో గౌరవించేవారు. సి.పి.ఐ.ఎం. నాయకుడు పుచ్చలపల్లి సుందరయ్యతో ఆయనకు వ్యక్తిగత మైన, బలమైన మైత్రీబంధం ఉంది. తెన్నేటి విశ్వనాధం గారంటే ప్రత్యేక గౌరవం. రాష్ట్రపతి హోదాలో ఆయన విశాఖ పట్టణానికి వచ్చినప్పుడు స్వయంగా విశ్వనాధం గారింటికి వెళ్ళి పలుకరించారు. ఒక్కమాటలో చెప్పాలంటే నైతిక విలువలకు అత్యధిక ప్రాధాన్యమిచ్చే ఒక రాజకీయ తరానికి ఆయన ప్రతినిధి. ●

ఎందరో మహానుభావులు - 29

## బొంత బాబా

హిమాలయాల్లో ఒక సన్యాసి తిరుగుతుండేవాడు. ఆయన ఎటు వెళ్లినా తనతోపాటొక పెద్ద బొంతను తీసికొని పోతుండేవాడు. వందలాది గుడ్డపీలికలతో చేసిన బొంతది. దాదాపొక బియ్యపు బస్తా అంత బరువుండేదది.

ఒకసారి ఆయనతోపాటు యాత్ర చేస్తున్న బృందంలో వొకరు 'బాబా! అంత బరువైన బొంతను ఎందుకు మోస్తున్నారు?' అనడిగారు.

ఈ బొంత రజాయిలు, కంబళ్లలాగా నిర్జీవం కాదు. సజీవం తెలుసా! అని జవాబిచ్చే వాడాయన. ఎప్పుడూ ఆయన ఆ బొంత వేసుకొని తిరుగుతూ వుండటం వల్ల ఆయన్నంతా బొంత బాబా అనేవాళ్లు. ఆయన అసలు పేరేమిటో ఎక్కడివాడో, ఎక్కడి నుంచి వచ్చాడో ఎవరికీ తెలియదు. ఆయననడిగినా నవ్వి వూరుకునేవాడు.

ఒకసారి ఆయనతోపాటు వెళుతున్న వారిలో ఒకరికి బాగా జ్వరం వచ్చి వణకటం మొదలుపెట్టాడు. అతడికి నడిచే పరిస్థితి కనపడలేదు. అతడిని వదలి వెళ్ళేట్లులేదు. అక్కడ ఆగే ప్రదేశమూ కాదు. అంతా ఏం చేయాలా? అని ఆలోచిస్తుంటే బొంతబాబా వచ్చి తన బొంతను అతనిపై ఒక నిమిషం పాటు కప్పి తీశాడు. వెంటనే ఆ వ్యక్తి పూర్తిగా ఆరోగ్యవంతుడై లేచి కూచున్నాడు. చిత్రమేమంటే, ఆ బొంత వేడిగా సెగలు కక్కుతూ, వొణకటం మొదలుపెట్టింది. అది చూసిన వారికి బాబా ఆ బొంత నిర్జీవం కాదు, సజీవమని ఎందుకంటూ వుండేవారో అర్థమయింది. కాసేపటికి ఆ బొంత వణకటం ఆగిపోయి, మామూలు స్థితికి చేరుకున్న తర్వాత వారంతా తమ ప్రయాణం కొనసాగించారు. (హిమాలయయోగులు శ్రీరామ (రచయిత) ఆధారంగా)

- భండారు పర్వతాలరావు

# పెద్దల మాట

"పెద్దల మాట చద్దిమూట" అని మన పెద్దలు ఏనాడో చెప్పారు ఎందుకంటే పెద్దలు ఏదిచెప్పినా అనుభవం మీద చెప్తారు. తమ జీవితానుభవాల్ని ఆధారం చేసికొని మంచి మార్గాన్ని, మంచి మాటల్ని మనకు అందిస్తారు అది చద్దిమూట లాంటిదని ఎందుకన్నారంటే, వెనుకటి రోజుల్లో చద్దిఅన్నానికున్నంత బలం యికదేనికీ ఉండదని! చద్దిఅన్నం అంటే అన్నం వార్చిన గంజిలో రాత్రిమిగిలిన అన్నాన్నివేసి ఓ ఉప్పురాయి తగిలించి అట్టేపెట్టేస్తారు. తెల్లవారేసరికి దాని కున్న రుచి, సత్తువ మామూలు అన్నం కన్న ఎక్కువ ఉండేది. దానినే తరవాణి అనేవారు అందుకనే పెద్దల మాట కూడ అంత బలమైనదీ అనే అర్థంలో ఆ సామెత పుట్టింది.

పెద్దలంటే మహానుభావులు! వారంతా పాండిత్యం సంపాదించినవారు. ఆధ్యాత్మిక మార్గాన్ననుసరించి, తమంతట తాము భగవత్సాక్షాత్కారాన్ని మానసికంగా పొందినవారు మోక్షమార్గానికి, సన్మార్గాన్ని చూపగల శక్తిమంతులు. పురాణగ్రంధాలతో వీటిగురించి వివరంగా వ్రాసినా ఆధ్యాత్మిక జీవనమన్నది కేవలం గ్రంధపఠనం వలన సాధ్య మయేది కాదు. అది అనుభవపూర్వకంగానే లభించాలి. ఎంతటి ప్రజ్ఞావంతునికైనా సద్గురు మార్గదర్శకత్వము తప్పని సరి.

అందుకే ప్రతి మనిషికి ఒక గురువు ఉండి తీరాలి. ఆ మనిషే ఈ గురువుకు శిష్యుడవుతాడు. ఆ శిష్యుడికి గురువుపై గురి ఉండాలి. అప్పుడే ఆ శిష్యునికి ఎన్ని ఒడిదుడుకులొచ్చినా, వెనుకడుగు వేయని విధంగా ఆధ్యాత్మిక జీవనాన్ని, ఆ గురువు ఉపదేశిస్తాడు. అటువంటి విద్యనభ్యసించ గోరే శిష్యుడు, గురువు యెడ గౌరవభావం, విశ్వాసం, విద్యాసక్తి కలిగిఉండాలి. ఏ విధమైన అనుమానము ఆతనికి ఉండరాదు. గురు ప్రజ్ఞను పరీక్షించాలను చాపల్యముతో పనికిమాలిన ప్రశ్నలు వేయరాదు. ప్రసంగములు చేయరాదు. గురువులకు ఆగ్రహము కల్గించు విధముగా ప్రవర్తించరాదు.

కురుక్షేత్ర సమరాంగణంలో ప్రవేశించిన అర్జునుడు, శత్రుబలగంలోని బంధు జనాన్ని చూచి కలవరపడతాడు. విజయలక్ష్మి కోసం, దాయాదులను,, సహోదరులను సంహరించి, హత్యాపాతకాన్ని మూట కట్టుకోవాలా? ఆ పాపకృత్యాన్ని తానెందుకు చేయాలి? అన్న మీమాంసతో విషాద యోగంలో పడిన పార్థునికి శ్రీ కృష్ణపరమాత్మ గురువై గీతోపదేశం చేస్తాడు. ఆ మహాపురుషునిపై సంపూర్ణ భక్తి విశ్వాసములు కలిగిన శిష్యునిలా అర్జునుడు తన సంశయ నివృత్తి చేసికొంటాడు. కర్తవ్యాన్ని గ్రహించి, రణరంగంలో విజృంభిస్తాడు. పాండవపక్షానికి విజయలక్ష్మిని చేకూరుస్తాడు. అటువంటి గీతోపదేశం చేసిన శ్రీ కృష్ణుని కంటె పెద్దలు యింకెవరుండగలరు? ఉండరు... కాని.

## సోమంచి రామం

కురుక్షేత్ర సంగ్రామంలో విజయం సాధించినందుకు సంతోషంతో గర్వించాలో లేక సకల బంధుజనాన్ని సమూలంగా సంహరించి హత్యాపాతకాన్ని సాధించినందుకు సిగ్గుపడాలో తేల్చుకోలేని మీమాంసతో ధర్మరాజు చింతాక్రాంతుడై కృంగిపోతాడు దానిని గ్రహించిన శ్రీ కృష్ణుడు "ధర్మరాజా! నీకు కలిగిన ధర్మ సంకటమునకు సరియైన సమాధానము కురువృద్ధులు భీష్మాచార్యుల వద్ద లభించ గలదు. అవశ్యము ఆయనను చేరుకొమ్మని హితవుపల్కాడు. అంతట ధర్మరాజు "జనార్దనా! ఆ మహాపురుషుని మహిమ గూర్చి యింతకు పూర్వమే అనేక పర్యాయములు విని యుంటిని. అయితే ముమ్మొందుగా నీవు ఆ మహనీయుని సందర్శించవలెనని నా కోరిక. ఆ పుణ్య పురుషుడు నీ సాన్నిధ్యాన్ని తప్పక అభిలషించగలడు." అని వేడుకొనెను

తదనుగుణ్యముగా పాండుకుమారులను వెంట నిడుకొని శ్రీకృష్ణ పరమాత్ముడు అంపశయ్యపైనున్న భీష్ముని దరిచేర్తాడు విషయం వివరిస్తాడు. "శ్రీ కృష్ణా! లోకాల సృష్టి స్థితికి సంహారాలకు ఏకైక హేతుభూతుడవునీవు! అట్టి నీవు ధర్మ పుత్రునికి హితవేదో అనుగ్రహింపక నన్నుకోరుట వింతగయున్నది. కావున సర్వసమర్థుడవగు నీవే పాండవుల కొక్కొక్కరికి సముచిత హితబోధ ప్రసాదించరాదా?" అని వినయం పూర్వకంగా వేడుకొంటాడు.

"కౌరవకులాగ్రణీ! సర్వశుభాలకు నేనే ప్రధాన హేతుభూతుడను. కాని నీ ముఖతః ధర్మాధర్మ రహస్యాలు పాండవులు వినవలెను. అది పెద్దలకు మీకే తగును" అంటాడు శ్రీకృష్ణుడు.

# సర్జరీలు చేసే జలగలు

చాలా పాశ్చాత్య దేశాలలో, కొన్ని ఆసియా దేశాలలో "డ్రాకులా" అన్నపదం వింటే జనానికి ఒళ్ళు గగుర్పొడుస్తుంది. "డ్రాకులా" అనేది ఒక రక్తపిపాస రాక్షసి అని, అది మనుష్యుల రక్తం పీల్చి ప్రాణాలు హరిస్తుందని వారి నమ్మకం. నిజానికి ఇట్టి జీవిని ఇంతవరకూ ఎవరూ చూడకపోయినా ఈ భయం అభివృద్ధి చెందిన దేశాల్లో కూడా ఉండడం విచిత్రం. డ్రాకులా సంగతి ఏమో కాని, నిజంగా మనుష్యుల, జంతువుల రక్తాన్ని పీల్చి జీవించే ప్రాణి ఒకటుంది. అదే జలగ. ఇవి చెరువులు, దొరువులు, తడినేలలు వంటి చోట్ల ఉంటాయి. అందుకే పిల్లలు స్నానానికి చెరువులకు వెళ్తొంటే 'ఒరేయి జలగిలుంటాయి జాగ్రత్త' అని హెచ్చరిస్తూంటారు పెద్దవాళ్ళు.

జలగ పట్టుకొన్నప్పుడు జస్టు సూది గుచ్చినట్లు నిపిస్తుంది. అంతే ఆ తర్వాత వానికేమి తెలీదు. ఇంజక్షన్ లోంచి మందు లోపలికి వెళ్తే అది శరీరంలోని రక్తాన్ని ఇంజక్షన్ గొట్టంలోకి లాగినట్లుగా తన శరీరంలోకి పీల్చుకుంటుంది. రబ్బరు బెలూన్‌లాగా వుండే దీని శరీరంలోకి రక్తం బాగా వచ్చాక అది బాగా గాలికొట్టిన ట్యూబ్‌లాగా ఉబ్బుతుంది. ఇంక తాగలేక అలసిపోయి సొమ్మసిల్లి కింద పడిపోతుంది జలగ. అప్పటికి కూడా మనకి తెలియదు. తెలియకుండా రక్తం తాగే జీవి ఇది. అందుకే డాక్టర్లని జలగలతో పోలుస్తారు. తమాషా ఏమిటంటే గ్రీకు భాషలో డాక్టర్‌కి, జలగకి ఉన్నది ఒకటే పదం. అంటే డాక్టర్లను జలగలతో పోల్చడం ప్రపంచమంతా ఉన్నదేనన్న మాట. అయితే అపకారి నుంచి కూడా ఉపకారం పొందగల నేర్పు మనిషికుంది. వెనుకటి రోజుల్లో ఆపరేషన్‌కి సౌకర్యాలు ఎక్కువగా ఉండేవికావు. అందువల్ల ప్రాచీనులు జలగల్ని వైద్యంలో వినియోగించుకునేవారు. రక్తపుపోటు ఎక్కువగా వున్న మనిషి వీపుకి జలగను పట్టించేవారు. అది కొంత రక్తాన్ని త్రాగేయడంతో బ్లడ్ ప్రెషర్ తగ్గేది. అదే విధంగా రాచపుండు వంటి వ్రణాల వల్ల లోపల చెడు రక్తం, చీము గూడుకట్టుకుపోతే ఆ పుండుకి జలగని పట్టించేవారు. అది చెడురక్తాన్ని, చీమునికూడా పీల్చేసేది. అంటే సర్జన్ వ్రణాన్ని కోసి లోపల శుభ్రం చేసినట్లన్నమాట. ఒక్కోసారి శరీరానికి గాయం అయి రక్తం గడ్డకట్టుకుపోతుంది. ఇది రక్తప్రసరణకు అవరోధం అవుతుంది. అపుడు ఆ గడ్డకట్టిన చోట జలగను పట్టించేవారు అది ఆ గడ్డకట్టిన రక్తాన్ని తాగేసి, ఆ అవరోధాన్ని తొలగించి రక్త ప్రసరణ సాఫీగా అయ్యేట్టు చేసేది. ఈ జలగ వైద్యం మన దేశంలోనేకాక, చైనా, ఈజిప్టు, గ్రీస్ వంటి దేశాల్లో ఉండేది. ఆయుర్వేదంలో చరకసంహిత, సుశ్రుత సంహితలలో జలగ వైద్యం గురించి విశేషమైన ప్రస్తావన ఉంది. అయితే ఆధునిక వైద్యం అభివృద్ధి చెందడం శస్త్ర చికిత్సకు అద్భుతమైన పరికరాలు రావడంతో ఈ జలగ వైద్యాన్ని అనాగరికంగా భావించి దానికి చరమ గీతం పాడారు. అయితే ఆధునిక పరిశోధనలు జలగ కేవలం ఏక పక్షంగా రక్తాన్ని పీల్చడమే కాదు. అందుకు ప్రతిగా వ్యాధి నివారణకు అవసరమైన రసాయనాలను అందిస్తుందని నిరూపించాయి. జలగ లాలాజలంలో 'హిరుడిన్' అనే రసాయనం ఉంటుంది ఇది రక్తం గడ్డ కట్టడాన్ని నిరోధిస్తుంది. అలాగే 'హెమెటిన్' అనే మరో రసాయనం గడ్డకట్టిన రక్తాన్ని కరిగిస్తుంది ఇందువల్ల రక్త ప్రసరణ సాఫీగా జరగడం, గుండెపోటు తగ్గడం సంభవిస్తాయి. 'హయలురోనిడేస్' అనే మరో రసాయనం ఉంటుంది. ఇది జీవకణాలను పట్టివుంచే సిమెంటును కరిగించి వేస్తుంది. గాయాలై చెడిపోయిన భాగాలలోని సిమెంటును కరిగించి వేయడం వల్ల బాగుపడిన భాగాలకు కొత్త సిమెంటు తయారై గాయం త్వరగా మానుతుంది. అంతేకాదు. ఈ రసాయనం శరీరంలోకి ప్రవేశపెట్టిన ఔషధాలు వేగంగా వ్యాపించేటట్లు చేస్తుంది. మద్యానికి బానిసలు అయినవారికి, కీళ్ళనొప్పుల నివారణకు ఇది ఎంతగానో సహాయపడ్తుంది.

1830 దశకంలో లండన్‌లోని ఆస్పత్రులలో ఏటా 70 లక్షల జలగలను ఉపయోగించినట్లు రికార్డులు తెలుపుతున్నాయి. ఈ విధానం తర్వాత తర్వాత అంతరించినా, ఇటీవలి కాలంలో రాయ్‌సామర్ అనే బ్రిటిష్ వైద్యుడు ఈ వైద్యానికి పునఃప్రతిష్ఠ చేశాడు. జలగ వైద్యంలోని రసాయనిక ప్రక్రియలను గుర్తించింది ఈయనే. గతంలో మూడురకాల జలగలనే వైద్యానికి ఉపయోగించేవారు. ఇపుడు మరో తొమ్మిది రకాలను ఆయన కనుగొన్నాడు. అంతేకాదు, సౌత్‌వేల్స్‌లోని హెండే వద్ద ఒక జలగల ఫారంని స్థాపించి జలగల సేద్యం చేస్తున్నాడు. ఈ వైద్యం మళ్ళీ ప్రాచుర్యం పొందడంతో ఈ వైద్యంపట్ల పలువురు ఆసక్తిని ప్రదర్శిస్తున్నారు. ఖరీదైన ఆపరేషన్‌ల కంటే ఖరీదులేని జలగవైద్యం గత ప్రాభవాన్ని పొందనుంది.

- కె.ఆర్.కె. మోహన్



# "నా మచిలీపట్నం బంగారులు ఏరి?"

"నా మచిలీపట్నం బంగారులు ఏరి?" అంటూ అడుగులో అడుగు వేస్తూ, రెండు చోట్ల అడుగుతూ మా ముందుకు వచ్చారు స్వామి. స్వామి మా వంక చూచి 'మచిలీపట్నం వాళ్ళు' అన్నారు. అవును స్వామీ! అన్నాము. "ప్రొద్దున్న మీరు ఎక్కడికి వెళ్ళారు? మీ కోసం కబురు పంపించాను. మీ కోసం కాచుకొని కూర్చున్నా" అని స్వామి అనగానే మా ఒడలు పులకరించాయి. 'క్షమించండి స్వామి' అన్నాను 'సరే! అందరూ వెళ్ళి అక్కడ విడిగా కూర్చోండి' అని అంటూ విభూతి సృష్టించి నా చేతిలో పోసారు. మా కంటిధారలు కారుతున్నాయి, హృదయాలు ఆనందంతో బరువెక్కగా, కళ్ళనీరు తుడుచుకుంటూ, లేచి వెళ్ళి స్వామి రాకకై నిరీక్షిస్తూ విడిగా కూర్చున్నాము......

భగవాన్ శ్రీ సత్యసాయి సేవా సమితి, మచిలీపట్నం తరపున మేము 32 మంది సాయిసేన, మా మార్గదర్శకునిగా, రక్షకునిగా, నాయకునిగా స్వామినే ఎంచుకొని, మచిలీపట్నం నుండి ది. 4-7-2000 మంగళవారం ఉదయం గం॥ 6-30ని॥లకు శ్రీ సత్యసాయి ప్రేమ రథమును తీసుకొని 15 మోటారు సైకిల్స్‌పై పుట్టపర్తికి బయలుదేరి వెళ్ళాము. మార్గ మధ్యంలో 51 గ్రామాలలో ఆగి, సాయి నామాన్ని భజిస్తూ ప్రస్తుత పరిస్థితులలో అత్యావశ్యకమైన మత సామరస్యాన్ని చాటే స్వామి సందేశమును గ్రామగ్రామాన వినిపిస్తూ, కరపత్రములను పంచుతూ ప్రేమరథగీతాన్ని దిక్కులు పిక్కటిల్లేట్లు మారు మ్రోగిస్తూ, స్వామి ఫొటోలను, విభూతి ప్యాకెట్లను, పేదవారికి బట్టలను వితరణ చేస్తూ, గ్రామాలలో ఈ రోజున విలయ తాండవం చేస్తున్న త్రాగుడు, జూదము, మున్నగు దురలవాట్లను దూరం చేసే విధంగా రూపొందించబడిన 'మార్పురావాలి' సందేశాత్మక హాస్యనాటికను ప్రదర్శిస్తూ, స్వామి చేస్తున్న బృహత్తర కార్యక్రమములను, స్వామి జీవిత విధానాన్ని షిర్డీసాయి జీవిత విధానంతో సరిపోల్చుతూ తీసిన వీడియో ప్రదర్శనను ప్రదర్శిస్తూ, సనాతన గ్రామీణ క్రీడ అయిన 'కోలాటం' ప్రదర్శిస్తూ, 4 1/2 రోజులకు పుట్టపర్తి చేరాము. స్వామి చేపట్టిన మహోన్నత కార్యక్రమాలలో కొన్ని అయిన సుజల మంచినీటి పథకము, ఉచిత విద్య, ఉచిత వైద్యము మున్నగు కార్యక్రమాలను అద్భుతంగా చిత్రీకరించి రూపొందించిన శ్రీ సత్యసాయి ప్రేమరథము గ్రామస్తులను విశేషంగా ఆకట్టుకున్నది. గ్రామగ్రామాన అనూహ్యంగా లభించిన స్పందన మమ్మల్ని మరింత ఉత్తేజితుల్ని గావించింది. మార్గమధ్యంలో గల శ్రీ సత్యసాయి సేవా సంస్థల వారు ఇచ్చిన ఆతిధ్యం, చూపిన ప్రేమ, అందించిన సహకారము మరువలేనివి.

## కొమరగిరి శ్యామ్ ప్రసాద్

వరుణదేవుడు వర్షిస్తున్నా, సాయిదేవుని కరుణ చేత 4 1/2 రోజుల ప్రయాణాన్ని ముగించుకొని ది. 8-7-2000 మధ్యాహ్నం నాటికి పుట్టపర్తి చేరాము. 9వ తేది స్వామి తమ అపార కరుణను మా పై ప్రదర్శించి మమ్మల్ని దీవించి వెళ్ళారు. కంటిచూపులు, మూగసైగలు తప్ప నోటి మాటలకు నోచుకొని మా నిరీక్షణ మూడు రోజులు కొనసాగింది. మేమందరము హృదయములోనే స్వామికి నమస్కరించుకొని భాధాతప్త హృదయులమై ది. 11-7-2000 మంగళవారం ఉదయం దర్శనం అవగానే తిరుగు ప్రయాణమైన సమయంలో స్వామి మా గురించి వెతికారని, అడిగారని శ్రీ ఆదూరి శ్రీనివాసరావుగారు చెప్పగా విని విస్మయం చెందాము. ఎవ్వాని పిలుపు కోసమయితే మేమందరము పరితపిస్తున్నామో, ఎవ్వాని ప్రేమ నిమిత్తమై మేమందరమూ ప్రార్థిస్తున్నామో, ఎవ్వాని, అనుగ్రహం నిమిత్తమై మేమందరము ఆతురతతో ఎదురుచూస్తున్నామో, ఆ పిలుపు, ఆ ప్రేమ, ఆ అనుగ్రహం, అనూహ్యంగా లభించి మమ్మల్ని ఆనంద పరవశుల్ని చేసింది. అయితే 'ఆనందంలో విషాదం' మేము ఆ సమయంలో అక్కడ లేకపోవటము. హృదయవాసి మా ప్రార్థనలను ఆలకించారు సాయంత్రం దర్శనంలో అనుగ్రహ వర్షం కురిపించారు....

స్వామి మందస్మిత వదనంతో అడుగులు వేస్తూ మా వైపు వస్తూనే 'లేడీస్ కూడా వచ్చారా? అన్నారు. "లేదు స్వామీ రాలేదు" అన్నాను. 'మంచిది. సంతోషం' అంటూ ముందుకు నడిచారు. నన్ను సమీపించగానే అన్నాను

"స్వామీ మమ్మల్నందరినీ క్షమించండి" అనగానే స్వామి నా చెంపపై తట్టి "ఎందుకు క్షమించడం, మీరేం తప్పు చేసారు?" అన్నారు. 'స్వామీ! మీరు పిలిచినప్పుడు మీ పిలుపునందుకోలేక పోయాము కదా!' అన్నాను. 'అది మీ తప్పు కాదు, మీరు దాని గురించి బాధపడవద్దు. మీ కోసం వెదికాను అంతే' అన్నారు. ఒక అడుగు ముందుకు వేస్తూ 'సైకిల్స్ మీద వచ్చారు' అన్నారు. 'అవును స్వామి మోటారు సైకిళ్ళ మీద వచ్చాము' అన్నాను. 'అవును మోటారు సైకిళ్ళ మీద వచ్చారు చాలా సంతోషం' అంటూ ముందుకు నడిచారు. పలకరించిన ప్రతి ఒక్కరిని పులకరింపజేస్తూ దీవించుతూ, ఆశీర్వదించుతూ, కొందరి దగ్గర ఉత్తరాలు అందుకుంటూ, తొణికిసలాడుతున్న ప్రేమతో అందరినీ ఆనందింపజేస్తూ, పాదనమస్కార భాగ్యాన్ని ప్రతి ఒక్కరికి కలిగిస్తూ, ముందుకు సాగారు. 'స్వామీ! మా నూతన మందిరములో స్వామిని అర్చించుకునేందుకు ఏదైనా ప్రసాదించండి' అన్నారు సాయి సోదరులు శర్మగారు. 'మంచిది.' అని స్వామి ముందుకు వెళ్ళి మరల వెనక్కు వచ్చి 'స్వామిని మందిరాలలో కాదు. హృదయంలో ఉంచుకోవాలి.' అని శర్మగారి హృదయాన్ని చేత్తో స్పృశించారు. సోదరుడు ఉదయకుమార్‌కు ఫొటోపై **'With love Baba'** అని సంతకం చేసి ఆశీర్వదించారు. అందరినీ ఆనందంలో ఓలలాడిస్తూ స్వామి మరల మా ముందుకు వచ్చారు. 'స్వామీ! జీవితంలో దేన్నయినా భరించగలను కాని ఒక్కదాన్ని భరించలేను' అని అన్నాను నేను. స్వామి నవ్వుతూ 'దేన్ని భరించలేవు?' అన్నారు. 'స్వామీ! మీ ఎడబాటును భరించలేను' అన్నాను. 'స్వామి ఎడబాటు నీ జీవితంలో రాదు, రాదు, రాదు,' అని అంటూ 'ఇదిగో ఇది పెట్టుకో', అని ఒక **Three Diamonds ring** (మూడు వజ్రముల ఉంగరము) సృష్టించి నా కుడిచేతి ఉంగరం వ్రేలికి తొడిగారు. మేము చేసిన వివిధ కార్యక్రమాల ఫొటోలు, ప్రేమరథం, ఫొటోలతో కూడిన ఆల్బంను స్వామికి ఇచ్చాను. స్వామి ఆ ఫొటోలన్నింటినీ చూస్తూ ఉండగా స్వామితో అన్నాను. "స్వామీ! గ్రామగ్రామాన నగర సంకీర్తనలు, నాటకాలు, కోలాటం వేస్తూ వచ్చాము. గ్రామస్తులు బాగా **respond** అయ్యారు". "అవును నిజమే! చాలా సంతోషం" అన్నారు స్వామి. 'స్వామీ! మేము ఏ చిన్న కార్యక్రమము చేసినా అది మమ్మల్ని స్వామికి దగ్గర చేసేదిగా వుండాలి కాని స్వామికి దూరం చేయకూడదు' అన్నాను. వెంటనే స్వామి స్పందిస్తూ 'స్వామి మీకు ఎన్నటికీ దూరం కాదు, కాదు, కాదు....' అంటూ మమ్మల్ని ఆనందపారవశ్యంలో ముంచెత్తారు. 'స్వామీ! మా బ్యాటరీలు అన్నీ డిస్‌ఛార్జ్ అయిపోయినాయి. ఛార్జి చేయండి. మాకు శక్తిని ప్రసాదించండి' అన్నాను. 'ఎవరు చెప్పారు డిస్‌ఛార్జ్ అయినాయని. ప్రాపంచిక బ్యాటరీలు డిస్‌ఛార్జ్ అవుతుంటాయి. ఛార్జ్ చేస్తుంటారు. ఈ సాయి బ్యాటరీలు డిస్‌ఛార్జ్ కానే కావు' అన్నారు. మా ఆనందం అంబరాన్నంటింది. స్వామి ఫొటోలు చూచి 'చాలా సంతోషం' అని నా చేతిలో ఆల్బం పెట్టారు. 'స్వామీ! ఒక్క మనవి' అన్నాను. 'ఏమిటి' అన్నారు స్వామి. ఒక్క గ్రూప్ ఫొటో స్వామి అన్నాను. "కెమేరా ఏది?" అన్నారు. అదిగో స్వామీ అని చూపించగానే స్వామి ఒప్పుకొని మా అందరితో రెండు గ్రూప్ ఫొటోలు దిగి మమ్మల్ని ధన్యుల్ని చేసారు. మా జీవితాలలో మరువలేని ఆ మధుర క్షణాలను మననం చేసుకుంటూ, సాయిమాతకు అనేకానేక కృతజ్ఞతలు తెలుపుకుంటూ, తిరుగు ప్రయాణం అయినాము.

## భగవాన్ సాయి జన్మదిన ప్రత్యేక సంచిక

భగవాన్ సాయి 75వ జన్మదిన ప్రత్యేక సంచిక నవంబరులో వెలువడుతుంది. ప్రముఖుల వ్యాసములతో, భక్తుల అనుభూతులతో, భగవాన్ సాయి దివ్యోపదేశములతో, మహిమలతో, మల్టీకలర్ కవరు పేజీతో (స్వామి ఫొటోతో) సర్వాగ సుందరంగా రూపొందించ బడుతుంది. **త్వరపడండి! ప్రత్యేక సంచికను స్వంతం చేసుకోండి! వెల రు. 15/-లు మాత్రమే.** సెప్టెంబరు లోపు చందా కట్టినవారికి మాత్రం రు. 5/-లకే పంప బడుతుంది. అదనంగా చెల్లించ నవసరంలేదు. పాత చందాదారులకు ఈ ప్రత్యేక సంచిక పంపబడుతుంది. వారు ప్రత్యేకంగా, అదనంగా డబ్బు పంపనవసరంలేదు. రెన్యూవల్ చేయవలసిన వారు వెంటనే 'రెన్యూవల్' చేయండి. క్రొత్త చందాలు చేర్పించి ఈ సదవకాశము వినియోగించుకోండి! రెన్యూవల్ చేయనివారికి ఈ ప్రత్యేక సంచిక పంపబడదు. గమనించ ప్రార్థన.

**వ్యాసములు, భక్తుల అనుభూతులు, భగవాన్ సాయి మహిమలు పంపదలచినవారు ముద్రణతో రెండు పేజీలకు మించకుండా పంపవలెను. - సం.**



# పురుష సూక్తము 14

చంద్రమా మనసో జాతః
చక్షోస్సూర్యో అజాయత!
ముఖాదింద్ర శ్చాగ్నిశ్చ
ప్రాణాద్వాయు రజాయత!!

**అర్థం :**

| | |
|---|---|
| చంద్రమాః | : చంద్రముడు |
| మనసః | : యజ్ఞపురుషుని మనస్సునుండి |
| జాతః | : పుట్టినాడు |
| సూర్యః | : సూర్యుడు |
| చక్షోః | : ఆ పురుషుని చక్షువులనుండి |
| అజాయత | : జన్మించాడు |
| ఇంద్రఃచఅగ్ని | : ఇంద్రుడు మరి అగ్ని |
| చముఖాత్ | : ఆ పురుషుని ముఖం నుండి మరి |
| వాయుః | : వాయువు |
| ప్రాణాత్ | : ఆ పురుషుని ప్రాణం నుండి |
| అజాయత | : జన్మించారు. |

**వ్యాఖ్య :**

మనస్సు ఒక అద్భుత శక్తి కేంద్రం. ఆ శక్తి అపారం. దాని చర్యలు అనూహ్యాలు. అపరిమితాలు. అది ఒక ఉల్లిగడ్డ వంటి దనుకో ఎన్నిపొరలు! ఎన్నివిభేదాలు! అది ఒకే వస్తువులో బహిరంతర భేదం చూస్తుంది. స్వపరభేదం సుఖం దుఃఖం ద్వైతం అద్వైతం ఎన్ని అనుభవిస్తుంది! మనస్సు అన్ని ఇంద్రియాలలో అతిచంచలం అతివేగం అతికల్పితం.

దీనికి వికాసం పొంది వృద్ధి పొందుట సంకోచం చెంది కుంచించుకు పోవుట సహజం.

"మనోమూల మిదంజగత్"

చంద్రముడు యజ్ఞపురుషుని ఈ మనస్సు నుండి జనించాడు చంద్రుని పదునారు కళలకు ఈ మనస్సుకు సంబంధం ఉంది. చంద్రకళలు మనస్థితికి సంకేతాలు.

సృష్టి ప్రవర్తనకు జలం మూలం. అందుకే విష్ణువుకు నారాయణుడు వార్ధిశయనుడు జలజనేత్రుడు అనే పేర్లు సార్థక్యాలు.

సముద్రాల ఆటుపోట్లకు చంద్రకళలకు అవినాభావ బంధం. అలానే శరీరంలోని ఆటుపోట్లకు చంద్రుడు కారణభూతుడు. మనస్సుపై చంద్రప్రభావం ఎంతైనా ఉంది! యజ్ఞపురుషుని అంశమే పురుషుడు కనుక మానవ జీవన గమనం చంద్రుని పై ఆధారపడి వుంది. చక్షువులు దృగ్యంత్రాలు. నేత్రగోళాలు. కిరణలక్షణం అంతర్బాహ్య వీక్షణం. ఈ కిరణ ప్రసారానికి సూర్యుడధిపతి. సూర్యప్రతి బింబమే చంద్రుడు. సూర్యుడు చక్షుస్సు లకు చంద్రుడు మనస్సుకు కారకులు. ప్రేరకులు. సూర్య చంద్రులు ఓషధులను రసాయనాలను కాంతులను శాంతులను చేకూరుస్తుంటారు. ఋతుచక్రాలు త్రిప్పుతుంటారు. సంవత్సర పరిణామాలు ఫలాలు ప్రసాదిస్తుంటారు. ఇంద్రియాలకు అదిపతి ఇంద్రుడు. ఇంద్రుడు దేవరాజు దేవతలకు అతిప్రదానుడు. ఈ దేవేంద్రుడు బృహస్పతిని ఆరాదిస్తాడు. బృహస్పతి తంత్ర మహిమతో రాజ్యం చేస్తుంటాడు. బృహస్పతి వాచస్పతి వాక్కుకు అధిపతి. వేద ప్రవర్ధనుడు వేదాలకు వాక్కు ముఖద్వారం అట్టి దేవేంద్రుడు -

అగ్ని అనేక విదాలు. శరీరంలోనిది జఠరాగ్ని. గృహోప యోగమైనది గృహాగ్ని. సముద్రంలో బడబాగ్ని. అడవిలోని దావాగ్ని పవిత్ర యజ్ఞగుండంలోనిది హోమాగ్ని నిత్య ఆరాధితాలు ఆహవనీయాగ్ని ఆహితాగ్ని దక్షిణాగ్ని ఇలా ఎన్నో - దేవేంద్రుడు అగ్నిదేవుడు ఇరువురు ఆపరమ పురుష ముఖం నుండి వెలువడ్డారు. తదుపశమనం కొరకే ఆహారం ముఖం ద్వారా స్వీకరించబడు తోంది. సర్వేంద్రియాలకు శక్తివస్తోంది. కనుక వీరు ముఖం నుండి జనించారు. ఆకాశంలోని సంకోచ వ్యాకోచాత్మక స్వభావమే ప్రాణం. ఈ సంకోచ వ్యాకోచాలనుండి వాయువు జనిస్తోంది. వాయువే ప్రాణశక్తి. అట్టి వాయువు అన్నిటికి మూలం. సకల ప్రాణులకు వాయువు ప్రాణం కదా! ప్రాణం నుండి వాయువు జనించింది. హనుమకు వజ్రఘాతం తగిలినపుడు వాయువు స్తంభించాడు. దేవాదులు వచ్చి వాయు ప్రసారం లేనిదే బ్రతుకు లేదని వాపోయారు..

## రేడియో ప్రసంగం

"నూతన శకానికి అడ్డుగోడలు-మతవిభేదాలు" అను అంశంపై జరుగు చర్చాకార్యక్రమంలో శ్రీవాణి ఎడిటర్ "శ్రీ కొమరగిరి" పాల్గొని ప్రసంగిస్తారు. ఈ విషయమును గురించి "ఆకాశవాణి" ది. 22-8-2000 (మంగళవారం) ఉ॥ 7-15 ని॥లకు ప్రసారం చేస్తుంది. శ్రీవాణి పాఠకులు విని, అభిప్రాయములు తెలియజేయ ప్రార్థన.

గురుపూర్ణిమ సందేశం

# పవిత్రమైన భావాలు పెంచుకోండి! ఏకాత్మభావాన్ని అభివృద్ధి పరచుకోండి!

ప్రేమస్వరూపులారా!

భగవంతుడే ప్రేమ. ప్రేమనే భగవంతుని స్వరూపము. "మమైవాంశోజీవలోకే జీవభూతస్సనాతనః" అని గీత బోధించింది. భగవంతుడు తన ప్రేమను ఏ విధంగా జగత్తంతా ప్రకటింపజేస్తున్నాడో, అదే విధముగ ప్రతి మానవుడు కూడనూ తన ప్రేమను జగత్తంతా ప్రకటింప జేయాలి. 'అనిర్వచనీయం ప్రేమ' ఇట్టి ప్రేమ తత్త్వమును మానవుడు గుర్తించుకొనలేక. తన ప్రేమను, ప్రాకృతమైనటు వంటి, భౌతికమైనటువంటి వస్తువాహనాల నిమిత్తమై, దీనిని ఉపయోగించుకుంటున్నాడు. భగవంతుడు గుణాతీతుడు. ప్రేమ కూడనూ గుణాతీతమైనటువంటిది. అట్టి గుణాతీత మైనటువంటి ప్రేమను, గుణములతో చేర్చి, మానవుడు తన జన్మను వ్యర్థంగావించుకుంటున్నాడు. ఈ ప్రాకృత మైన జగత్తునందు తల్లీబిడ్డల ప్రేమ, భార్యాభర్తల ప్రేమ, అన్నదమ్ముల ప్రేమ, బంధుమిత్రుల ప్రేమ వీటన్నింటికీ 'ప్రేమ' అనే పదమును ఉపయోగాపెట్టి, ఈ జీవితాన్ని గడుపుతున్నాడు మానవుడు. నీవు పుట్టకపూర్వం ఈ తల్లి ఎవరు? ఈ బిడ్డ ఎవరు? అప్పుడు ఈ తల్లికి ఆ బిడ్డపైన ప్రేమ ఉన్నదా? జన్మించిన తరువాతనే తల్లికి ప్రేమ ఏర్పడుతుంది. పెండ్లి తరువాతనే భార్యాభర్తలు ప్రేమించు కుంటారు. ఇదే విధముగనే బంధుమిత్రుల ప్రేమ, అక్కచెల్లెళ్ళ ప్రేమ, అన్నదమ్ముల ప్రేమ, అన్నీ కూడనూ శారీరక సంబంధమైన Negative ప్రేమలే. ఈ దేహం సంబంధమైన 'ప్రేమ' అనిపించుకోదు. ఇది కేవలం ప్రాకృతమైన సంబంధ బాంధవ్యమే. నిజమైన ప్రేమకు ఇచ్చి పుచ్చుకునే సంబంధంగాని, ఇంకే విధమైన సంబంధం గాని ఉండదు. భగవంతుడిని ప్రేమిస్తారు భక్తులు. ఓ భగవంతుడా! నాకీ కార్యం నెరవేరినప్పుడు, ముడుపులు చెల్లిస్తామంటారు. కొబ్బరికాయలు కొడుతామంటారు. కానీ ఇది భక్తియా? కాదు...కాదు... ఇచ్చి పుచ్చుకునేటటు వంటిది వ్యాపార సంబంధమైనటువంటిదేగాని, భక్తి సంబంధం కాదు. నిజమైన భక్తుడు కేవలం ఇచ్చుకోవటమే గాని, పుచ్చుకోవటమనేది ఉండదు. కనుక అర్పితమే భక్తి యొక్క ప్రధాన కర్తవ్యం.

మానవజీవితం ఐహిక ఆముష్మికముల సమ్మిళితము. కాని ఈనాటి మానవుడు ఆముష్మికమును విస్మరించి, ఐహికమును విశ్వసించి, బుద్ధితో దీనిని అనుభవిస్తూ వస్తున్నాడు. బుద్ధితత్త్వముతో అనుసరించినంత వరకునూ, కేవలం తనకుగాని, సంఘమునకుగాని, దేశమునకు గాని శాంతి భద్రతలు చేకూరవు. కనుక ఈ విధమైనటు వంటి సంబంధ బాంధవ్యమును మనం దూరం గావించు కొని, హృదయ సంబంధమైన ప్రేమ తత్త్వాన్ని మనం పెంచు కొనినప్పుడే, దేశంలో శాంతి భద్రతలు చేకూరుతాయి.

## భగవాన్‌సాయి హితబోధ

సృష్టి తంత్రము ధర్మాధర్మములు. సత్యాసత్యములు, పాపపుణ్యములు, శీతోష్ణములు. కాని ఈ జగత్తునందు కేవలం 'ధర్మము' మాత్రమే ఉండుటకు వీలుకాదు. లేక 'అధర్మము' మాత్రమే వుండుటకు సాధ్యం కాదు. అధర్మమును నిర్మూలనంగావించి, ధర్మమును స్థాపించా లని ఆశిస్తుంటారు. ఇది అసాధ్యం. ధర్మాధర్మముల మిశ్రమమే ఈ జగత్తు. ఇవి రెండూ వుండినప్పుడే మానవత్వమునక్కు ఒక విధమైన ఉత్సాహం ఏర్పడుతుంది. ఈ జగత్తునందు ధర్మాధర్మములు లేకుండా, సత్యా సత్యములు లేకుండా, ఏనాడూ ఈ జగత్తు నిలువ జాలదు. కనుక ఈ రెండింటియందు ధర్మమును మాత్రమే మనం అంగీకరించి, అధర్మమును విస్మరించి, దానిని పరికిస్తూ, పరీక్షిస్తూ జీవితాన్ని గడుపుతూ రావాలి. అయితే ఈనాటి మానవుడు ఎవరిది మానవధర్మం? ఎట్టిది పశుధర్మం? అనేటటువంటి సత్యాన్ని గుర్తించుకోలేకపోతున్నాడు. **అహింస, సత్యం, సానుభూతి, ఈ మూడూ సర్వజీవుల సమానధర్మము.** మానవత్వమును విస్మరించి, కేవలం పశుత్వమును స్వీకరించి గుణములందు, బుద్ధియందు కేవలం పశుత్వమునే అభివృద్ధి పరుచుకొనినంత వరకునూ, మానవుని యొక్క హృదయములో శాంతి భద్రతలు ఏమాత్రం నిలువజాలవు. ఆహారనిద్రభయమైథునాదులు మానవునకు, పశువునకు సమానమైనవే.

అయితే మానవధర్మములు ఏమిటి? పశుధర్మములు ఏమిటి? "మేము మానవులము" అని అనుకోవటం, విశ్వసించటము అర్ధసత్యమే. 'నేను పశువును కాదు' అనే రెండవ అర్ధసత్యమును గుర్తించి నిర్ణయించుకోవాలి. ఈ రెండింటి యొక్క ఏకత్వమే నిత్య సత్యము. 'నేను మానవుడను, పశువును కాదు. నేను మానవుడను, పశువును కాదు' అనేటటువంటి సమన్వయాన్ని మానవుడు అభివృద్ధి పరచుకోవాలి. ఇంతమాత్రముననే ధర్మము నెరవేరదు. నేను మానవుడనే. అయితే నేను స్త్రీనా? పురుషుడనా? నేను సంసారినా? సన్యాసినా? ఈ అన్నింటినీ విచారణ చేయాలి. ఆయాస్థానములకు సంబంధించిన ధర్మమును మాత్రమే మానవుడు అనుసరించాలి. మానవుడు బ్రహ్మచారిగా వుండి, గృహస్థధర్మాన్ని అనుభవించ గూడదు. ఆ విధంగా అనుసరించినప్పుడు ఈ జగత్తులో ధర్మసంక్రమణ ఏర్పడుతుంది. సమాజంలో కల్లోలం ఏర్పడుతుంది. అయితే ఈనాడు ధర్మమును సరీగా అర్థం చేసుకోలేక ప్రవర్తిస్తున్నాడు. కనుక ప్రతిమానవుడు ధర్మాన్ని అనుసరించే లోపల, నేను బ్రహ్మచారినా? లేక గృహస్థస్థితిలో వున్నానా? లేక వానప్రస్థస్థితిలో ఉన్నానా? అని విచారించి, దానికి సంబంధించిన ధర్మమునే ఆచరిస్తూరావాలి. ఒకరు అనుసరించవలసిన ధర్మమును, మరొకరు అనుసరించ కూడదు. మానవులందరికీ ఒకే ధర్మమని భావించకూడదు. అదియే అధర్మానికి మూల కారణమవుతున్నది. కనుక

మానవుడు తన ప్రమాణమును గురించి చక్కగా విచారించి, దానికి సంబంధించిన ధర్మమునే ఆచరిస్తూ రావాలి. ఆ నియమాలు తప్పిప్రవర్తించటం చేతనే, ధర్మ హీనం జరుగుతున్నది. ఈ జగత్తులో ధర్మాధర్మములు లేకుండా వుండటానికి వీలులేదు. ఈ రెండింటి సమన్వయం చేతనే మానవత్వాన్ని దివ్యత్వంగా మార్చుకోవాలి.

పశుత్వమంటే ఏమిటి? ఈ పశువుల యందు కూడనూ కొన్ని నియమములు వుంటున్నాయి. మానవుల యందు కూడా కొన్ని నియమములుంటున్నాయి. అయితే ఇరువురూ సమానమని భావించుకోవటం మంచిది కాదు. అనేకమంది భారతీయులు పూజించే పూజలను ఆరాధించే అర్చనలను విరుద్ధంగా భావిస్తున్నారు. భారతదేశంలో ఇన్ని యిక్కట్లు రావడానికి, ఇన్ని హింసలు జరగడానికి, ఇన్ని కల్లోలములు చెలరేగడానికి కులమతములే కారణమని భావిస్తున్నారు. అనేక మతములతో కూడి ఉన్నది భారతదేశం. కాని మతములు లేకుండా వుండటానికి వీలు కాదు. ఈ కల్లోలములు ఈ మతముల వలన ఏర్పడినటు వంటివి కాదు. మతములు మానవుడు నిర్మించినటు వంటివి కావు. అవి సహజమైన ధర్మములు. ఈ కల్లోలములకు కులములు మతములు ఏమాత్రం కారణం కావు. మానవుని అంతఃకరణయందున్నటువంటి భావములే దీనికి మూల కారణం.

ఒక చిన్న ఉదాహరణ. జర్మన్ దేశంలోపల కుల మతములు ఏమాత్రంలేవు. కాని రెండవ ప్రపంచయుద్ధం తరువాత ఈ జర్మన్‌ను నాలుగు ముక్కలుగా పరిపాలన చేస్తూవచ్చారు. దీనికి కులమత భేదములా కారణం? జపాన్‌ను కూడా విభజించారు. అక్కడ కూడా కల్లోలములు ఏర్పడినాయి. వీటన్నిటికీ కులమతములు, ఆరాధనలూ మూల కారణం కాదు. మానవుని యొక్క భావములే దీనికి మూల కారణం. కనుక కులమతములే వీటికి మూల కారణమని భావించు కోవటం చాలా తప్పు. భారతదేశంలో ఎన్నో మతములుండినప్పటికినీ, ఐకమత్యముగా, అన్యోన్యంగా, సోదరభావమును పెంచుకొని, అనేక వేల సంవత్సరాలుగా జీవితాన్ని గడుపుతూ వచ్చారు.

"మతములన్నియు వేరు మార్గంబు ఒక్కటే
వస్త్రభేదములు వేరు వస్తువొక్కటే
శృంగారములు వేరు బంగారమొక్కటే
పశువుల వన్నెలు వేరు పాలు ఒక్కటే
జీవజంతువులు వేరు జీవుండు ఒక్కడే
పూల జాతులు వేరు పూజ ఒక్కటే
తెలియలేకను మానవుల్ తెలివి తప్పి
బ్రతుకు కోసము బహుబాధ బద్ధులైరి"

బ్రతుకు కోసమేగాని, మతములలో ఏమాత్రం భేదం లేదు. మతులలోనే ఉన్నది ద్వేషం, 'మతులు మంచివైన మతమేమి చెడ్డది?' కనుక ఈ కల్లోలములకు మతము కారణమని భావించడం పొరపాటు.

భారతదేశమునందు అనేక మతములున్నాయి, 'జాతి' కూడనూ మానవ నిర్మితం కాదు. అసలు 'జాతి' అనగా ఏమిటో అర్థాన్ని గుర్తించాలి. 'జాతి' అనగా ఒక స్వరూపానికి లక్షణం. ఒక వ్యక్తి వలన జాతి ఏర్పడదు. ఒక వ్యక్తిని నాశనం చేయవచ్చును. కాని, మానవజాతిని నిర్మూలనం గావించడానికి వీలుకాదు. వృక్షజాతి ఒక్కటే కాని వాటి ఫలములు అనేకం. 450 రకాల రుచులుగల ఫలము లుంటున్నాయి. అదే విధముగ మానవజాతి యందు కూడనూ మానవజాతి ఒక్కటే, కాని మానవులు వేరు వేరు.

వారి మనోభావములు వేరువేరు. సంకల్ప వికల్పములు వేరువేరు. ప్రవర్తన రీతులు వేరువేరు, ఇవన్నీ అంతఃకరణ ప్రభావములే. కాబట్టి జాతిని నిర్మూలనం గావించాలను కోవటం వెర్రితనం. వ్యక్తిని నిర్మూలనం గావించవచ్చును గాని, జాతి మాత్రం సత్యమైనటువంటిది, నిత్యమైనటు వంటిది. అదియే మానవజాతి. ఇట్టి పవిత్రమైనటువంటి జాతిని కేవలం కొన్ని కల్లోలములకు మూల కారణమని చెప్పుకోవటం కేవలం అజ్ఞానమే. **ఈనాడు ఈ జగత్తులో ఇన్ని కల్లోలములకు మూలకారణం మానసిక ప్రమాణములే. వ్యక్తి యొక్క ప్రవర్తనలే దీనికి మూల కారణం. జాతి, మత, కుల భేదములు ఏమాత్రం కారణాలు కావు. ఈ మూలాధార తత్త్వమును గుర్తించుకోలేని వ్యక్తులు మాత్రమే జాతిమత కుల భేదములే ఈ కలహాలకు మూలకారణమని భావిస్తున్నారు. ఇది చాలా పొరపాటు.** కనుక మన సంస్కృతిని మనం పవిత్రంగా చేసుకోవాలి.

ప్రాచీన భారతీయ సంస్కృతియందు, నిజమైన **తత్త్వం ఏకత్వమే.** ఆ ఏకత్వమును మాత్రమే మనం దృష్టి యందుంచుకోవాలి.

"Stars are many but Sky is one
Beings are many but Breath is one
Nations are many but Earth is one"

ఈ సత్యమును మనం గుర్తించుకుంటూపోవాలి. వ్యక్తిత్వములో వున్నటువంటి దివ్యత్వాన్ని మనం పవిత్రంగా భావించుకోవాలి. అన్నింటికీ మూల కారణం ప్రేమనే. ఈ ప్రేమ ఒకరి వలన ఏర్పడినటువంటిది కాదు, ఒకరి నుంచి అందుకున్నటువంటిది కాదు. ఇది సహజసిద్ధంగా ఏర్పడేటటువంటిదే. ఈ ప్రేమకు ఒకరు మూలకారణం కాదు, **దైవమే ప్రేమ, ప్రేమనే దైవము.** కనుక ఈ దైవత్వం తో వచ్చినటువంటి ప్రేమ తత్త్వాన్ని మనం ఏరీతిగానూ భిన్నత్వంగా భావించుకోకూడదు. కనుక ఈ ప్రేమ తత్త్వాన్ని మొట్టమొదట మనం చక్కగా విచారించాలి.

**"ప్రేమ రూపము బ్రహ్మంబు ప్రేమమయము
ప్రేమ ప్రేమతో సంధింప నీమమగును
కాన ప్రేమను గట్టిగా కలిగియున్న
అద్వితీయము చెందంగ నర్హుడగును".**

కనుక మన అద్వితీయమంతయు కూడనూ ప్రేమ యందే యిమిడి వుంటున్నది. కేవలం శరీరం అభిమానము లను పురస్కరించుకొని, దేహ బంధములను వేరువేరుగా భావించుకోవటం చేతనే, ఈ ప్రేమ భిన్నభిన్నంగా రూపొందుతున్నది. ఈ భిన్నభిన్నంగా ఏర్పడుతున్న ప్రేమ నిజమైన ప్రేమకాదు. ఇది సంబంధ బాంధవ్యములతో వచ్చినటువంటి ప్రేమ. ప్రేమ ఒక్కటే, ఏప్రాంతమునందైనా కాని, ఏదేశమునందైనా కాని ప్రేమతత్త్వం ఒక్కటే.

స్వామి ప్రేమ...ప్రేమ..ప్రేమ.. అని తరచుగా అంటుం టారు. అసలు ఈ ప్రేమకు రూపం ఏమిటి? అని అనేక మంది భావిస్తుంటారు. ప్రేమనే దైవము. Love is God **"ప్రేమ్ ఈశ్వర్‌హై! ఈశ్వర్ ప్రేమ్‌హై!"** ఈప్రేమ అనేటటువంటిది భగవంతుడే! ఈ ప్రేమనేటటువంటిది హృదయమే! ఈ ప్రేమ అనేటటువంటిది ఉనికియే! ఈ ప్రేమ అనేటటువంటిది ఆత్మనే! ఈ ప్రేమ అనేటటు వంటిది బ్రహ్మనే! నీవు ఏవిధంగా భావించుకొనినా, అన్నింటికీ ప్రేమ ఒక్కటే. సర్వమూ ప్రేమమయమే. ఇలాంటి ప్రేమకున్న రూపమేమని చెప్పగలం? కనుకనే నీ యందున్నదీ, నాయందున్నదీ ఒకే ఆత్మనే! ఒకే హృదయమే. కనుక హృదయాన్ని హృదయం ప్రేమిస్తున్నది. ఈ ఏకత్వాన్ని చక్కగా గుర్తించుకుంటే, ద్వేషమనేదే ఉండదు, అయితే ఈనాడు ఈ ఏకత్వమనేది భిన్నత్వంగా భావించు కోవటం చేతనే, అనేకరకములైన కలహములు కల్లోలములు విజృంభించి పోతున్నాయి. దేహము వేరువేరుగా ఉండ వచ్చును. కాని, ఆత్మతత్త్వం మాత్రం ఒక్కటే. **'ఏకాత్మ సర్వభూతాంతరాత్మ' 'అద్వైతం బ్రహ్మ'** అన్నారు. సర్వత్రా నిండినటువంటిదే ఆత్మతత్త్వము. సర్వత్రా దర్శించేటటు వంటిదే బ్రహ్మతత్త్వము, కనుక ఇట్టి ఏకత్వాన్ని మనం దృఢంగా విశ్వసించాలి.

దేహాభిమానం చేతనే అనేక విధములైన భేదములు ఏర్పడుతున్నాయి. కోపము, తాపము, ఈర్ష్య, ద్వేషం, అసూయ, డంబం ఇలాంటివన్నీ రావడానికి కారణం దేహాభి మానమే, ఆశలు చూపించి భగవంతుని అనుగ్రహాన్ని పొందడానికి ప్రయత్నిస్తుంటారు కొందరు. ప్రతిఫలాపేక్షతో భగవంతుని ఆరాధించడం అది భక్తియే కాదు, అది ప్రేమనే కాదు. ఎట్టి ప్రతిఫలాపేక్ష లేకుండా, ఒకే ఆత్మనే, నా ఆత్మను నేను చూచుకుంటున్నాను, నా ఆత్మతో నేను మాట్లాడు కుంటున్నాను, నా భగవంతునితో నేను కూడి వుంటున్నాను. ఇటువంటి ఏకత్వంలో మనం అభివృద్ధి కావాలి.

ప్రేమస్వరూపులారా!

నేను, మిమ్ములను అనేక పర్యాయములు 'ప్రేమ స్వరూపులారా!' అని పిలుస్తుంటాను. ఈ రూపము, ఈ దేహాభిమానంతో కూడినటువంటివికావు. ప్రేమస్వరూపమే

సత్యజీవము. అది నిర్గుణమైనటువంటిది ఆకారముతో కూడినటువంటిది. 'ప్రేమ' అని చెప్పడానికి వీలుకాదు, ఈమె నాతల్లి అని ఆకారాన్ని, నీవు తల్లిగా భావిస్తున్నావు. ఎప్పటి నుంచి? ఆమె పుట్టిన తరువాత, పెద్దవాడవైన తర్వాత నేను కొడుకు, ఆమెతల్లి అని అభిమానం ఏర్పడిన తరువాత, ఆమెను నీవు ప్రేమిస్తున్నావు ఈమె నాతల్లి అనేటటువంటి విశ్వాసమే గనుక లేకపోతే, నీవు ఆమెను ప్రేమించలేవు. కాబట్టి విశ్వాసమే ప్రేమకు మూలకారణం. ఆకారాన్ని నీవు తల్లిగా భావించుకున్నావు. అంతటితోనే నీ ప్రయత్నం మానకూడదు. దానినుంచి సత్యాన్ని అభివృద్ధి పరచుకోవాలి. దానినుంచి నీవు శాంతిని పెంపొందింప జేసుకోవాలి. ఆ శాంతి నుంచి నీవు సత్యములో ప్రవేశించాలి. అప్పుడు నీ జీవితం ధన్యమవుతుంది. ఇవన్నీ ఎక్కడనో లేవు, ఇవన్నీ నీయందే ఉంటున్నాయి. అన్నీ నీ నుంచి వచ్చినటువంటివే. భగవంతుణ్ని ప్రతిఫలాపేక్షతో మనం ప్రార్థించకూడదు. అద్దములో చూచిన ప్రతిబింబాన్ని ప్రేమించినట్లుగా, ఏ దేహమును చూచినా అందులో కూడా నా బింబమున్నదని భావించు, అందరిని ప్రేమించు, దేహాభిమానంతో కొన్ని మార్పులు కలుగవచ్చునుగాని, ప్రేమ యొక్క తత్త్వం ఒక్కటే, ప్రేమప్రేమనే, Love is love, Live in love. ఆ యొక్క తత్త్వాన్ని చక్కగా గుర్తించాలి.

ప్రతి మానవుడూ ప్రేమ స్వరూపుడే. ప్రేమ లేకుండా ఎన్ని సాధనలు చేసినా నిష్ప్రయోజనములే. ఏదో ఒక ఆశతో పూజలు చేస్తున్నారు, జపములు చేస్తున్నారు, ధ్యానం చేస్తున్నారు. ఇవన్నీ ఆశలయొక్క ప్రతిబింబములే. కనుక ఈ ప్రతిబింబములకు ఏమాత్రమూ అవకాశం యివ్వకూడదు. ప్రతిబింబాలు ఎన్నటికీ బింబస్వరూపములు కావు. అద్దం ముందునుంచొని, ఇది నా కుడికన్ను అంటావు. కాని నీ కుడికన్ను, అద్దంలో ఎడమ కన్నుగా కనిపిస్తుంది. అది నీ ప్రతిబింబం. కాని, అద్దమే లేకపోతే నీ బింబము బింబమే. కాబట్టి ప్రపంచమే ఒక అద్దము.. ఈ అద్దమును ఆధారం చేసుకొని నీవు బ్రతుకుతున్నావు. ఈ అద్దములో చూచినవన్నీ ఇవన్నీ Negative. Negative ఇవన్నీ ఆపోజిట్లే. నీ కుడికన్ను ఎడమ కన్నుగా, నీ కుడి చేయి ఎడమ చేయిగా కనిపిస్తుంది. ఇదే సత్యమనుకుంటావు. కాదు.. కాదు . అందుకనే సాక్షాత్ + ఆకారము = 'సాక్షాత్కారము' అన్నారు. నేను ధ్యానంలో 'సాక్షాత్కారము' పొందానంటాడు. అది సాక్షాత్ ఆకారము కాదు, అది ప్రతిబింబమే. అది నీ భ్రమ యొక్క చిత్రమే. అదంతా 'సాక్షాత్కారము' కాదు. ఏది సాక్షాత్కారము? నీరూపమే నీకు సాక్షాత్కారము. కనుక ప్రతి మానవుడూ, తన ఆకారమును తన స్వంతంగా భావించుకొని, తానే దైవ స్వరూపంగా విశ్వసించుకొని, నీ ప్రేమతత్త్వాన్ని నీవే అనుభవించాలి. ఈ లౌకిక సంబంధ బాంధవ్యములు తాత్కాలికమైనటువంటివి. ఇవన్నీ కదిలిపోయే మేఘాల వంటివి. ఇవి ఎంతసేపు ఉంటాయి? కొంత కాలం మాత్రమే నిలిచివుంటాయి. తరువాత మారిపోతుంటాయి కాని నిజమైన ఆకారం మారేటటువంటిది కాదు. అట్టి మారనటువంటి తత్త్వాన్ని నీవు గుర్తించాలి. అదియే ప్రేమ తత్త్వము. ప్రేమ ఏనాటికినీ మారదు. అయితే ప్రాకృతమైన ప్రేమ మాత్రం, ఈనాడు ప్రేమగా ఉంటుంది, రేపు ద్వేషంగా మారవచ్చును. కాని పవిత్రమైన ప్రేమతత్త్వము దైవము ఒక్కటే. అల్లా, బుద్ధ, నానక్, రాముదు ఏ విధంగా అనుకొనినా, అవన్నీ పెట్టిన పేర్లే. ఈ దేహమునకు పేరు ఎవరు పెట్టారు. ఎవరో ఒకరు పెట్టిన పేరే ఇది కాని పుట్టిన పేరు కాదు. కాని ప్రేమ అనేది పుట్టిన ప్రేమ. ఈ దేహానికి పెట్టినవి పెట్టిన ప్రేమలు. కాబట్టి పెట్టిన ప్రేమలను మార్చుకోవచ్చును. అవి మారేటటువంటివే కాని ప్రేమ తత్త్వం మాత్రం మారనటువంటిది. దైవ ప్రేమ అనేది ఏనాటికీ మారదు. అట్టి మారనటువంటి తత్త్వము ఏ విధమైనటువంటి చలనము రానటువంటి తత్త్వము అయిన అట్టి ప్రేమను మనం ప్రేమించాలి. అదే నిజమైనటువంటి భక్తి. ప్రేమకు పర్యాయ-పదమే భక్తి ఈ భక్తి వలన అనేక శక్తులు కూడా వస్తాయి. భక్తి వలన యుక్తి కూడా వస్తుంది. భక్తివలన రక్తికూడా కలుగుతుంది. భక్తివలన విరక్తులు కూడా కలుగుతాయి. భక్తి వలన ముక్తికూడా వస్తుంది. యుక్తి రక్తి, విరక్తి, ముక్తి ఇవన్నీ ఒక్క భక్తి వలన వచ్చేటటువంటివే. అయితే అన్నింటి యందు 'క్తి'..క్తి..క్తి..క్తి..' ఒక్కటే, కనుక ప్రేమ తత్త్వాన్ని అర్థం చేసుకోవటానికి మనం కృషి చేయాలి. అట్టి ప్రేమను తానే అనుభవించక, పశుపక్షి మృగాములకు కూడా పంచాలి. ప్రతి జీవికి పంచాలి. అందరూ ఏకమత్యం తో జీవించాలి. విశ్వకుటుంబంగా రూపొందాలి అప్పుడు ద్వేషాలు, కోపాలు, తగాదాలు ఉండవు.

ఈనాడు ప్రపంచంలో ఎక్కడ చూచినా కల్లోలములు, కలహములకు కారణమేమిటి? మానవునిలో విశాలత్వం లేకపోవటమే దీనికి కారణం. విశాలమైన హృదయం లేదు. సంకుచితమైన హృదయాలు పెట్టుకున్నారు. ఆ సంకుచితమైన హృదయాలు మానవుడు సృష్టించుకొనినటువంటివి. భగవంతుడు సృష్టించినటువంటిది విశాలమైన హృదయము. దానికి పరిమితం లేదు. అటువంటి అపరిమితమైనటువంటి

ఆత్మతత్త్వాన్ని, పరిమితంగా పెట్టుకోవటం చేత, మనం అనేక కష్టముల్లకు గురి అవుతున్నాము.

ప్రేమస్వరూపులారా!

ఈనాడు 'గురుపూర్ణిమ' అన్నారు, అంధకారమును నివారణ కావించునటువంటి ప్రకాశమే. ఎక్కడ చూచినా ప్రకాశించేటటువంటి వాడు భగవంతుడే. సర్వత్రా ఉన్నటువంటి వాడు భగవంతుడే. కనుక ఎవరూ, ఎవర్ని ద్వేషించకూడదు. ఈనాడు లోకంలో సంకుచితమైన భావాలను పెట్టుకొని ద్వేషము...ద్వేషము... ఒకప్రాణాన్ని మరొక ప్రాణం తీయటం. ఇది ఎంతపాపం... ఎంతపాపం... దైవాన్నే నీవు కొట్టినట్లవుతుంది. కనుక అది చాలా పొరపాటు. ఎవరినీ ఎవరూ ద్వేషించకూడదు. తన ద్వేషం, తననే ద్వేషిస్తుంది. మనం ఎవరినో ద్వేషిస్తున్నాం.... మనం ఎవరినో హింసిస్తున్నాం..... అని ఆనందించవచ్చును. అది సరియైన ఆనందమే కాదు. అది కేవలం 'రాక్షసానందము'

నీవు ఇతరులను సంతోషపెట్టు. అదే నీకు ఆనందం, ఆ ఆనందమే నిజమైన స్వరూపం నీది. ఎవరినీ బాధపెట్ట కూడదు. ఈనాడు నీవు ఇతరులను హింసించవచ్చు. కాని రేపటి దినం నిన్ను హింసించేవాడు మరొకడు వస్తాడు. ఆనాడు నీ గతి ఏమిటి? కనుక మనం ఎవరినీ హింసించ కూడదు. ఈనాడు హింసించడం, బాధించడం, చంపటం ఒక Fashion అయిపోయింది. కీటకం కూడా చంపు తుంది. **చంపటం గొప్పతనం కాదు, బ్రతికించడం గొప్పతనం.** ఈనాడు నీవు తప్పించుకున్నావని ఆనందించ వచ్చు. ఏదో ఒకరోజున నీకూ తప్పదు. ఏనాటికీ తప్పదు. Reaction. Resound, Reflection ఇవి ఏనాటికీ తప్పవు. నీవు మంచి చేయి, నీకు తప్పకుండా మంచే చేకూరుతుంది. తక్షణమే నీకు మంచి చేకూరలేదని విచారించవద్దు, నిరాశ చెందవద్దు, కొంత సమయం వేచివుండు. అప్పుడే ఆ ఫలితం నీకు దక్కుతుంది. ఏ మానవునికీ సత్ఫలితం దక్కకుండా పోదు. అయితే దుష్ఫలితాలను దూరం గావించుకోవటానికి ప్రార్థన కొంత సహాయం చేస్తుంది. అదే 'కృతజ్ఞత'. కనుక కృతజ్ఞతను మనం చెప్పుకోవాలి, ఆచరించాలి. 'క్షమ' చాలా ప్రధానమైనటువంటిది.

**"క్షమ సత్యము క్షమ ధర్మము**
**క్షమయోగము క్షమ అహింస క్షమ సర్వంబౌ**
**క్షమ సంతోషము క్షమ స్వర్గము**
**క్షమ సర్వస్వంబు సర్వజీవులయందున్"**

ప్రతి మానవుని యందును 'క్షమ' చాలా గొప్పది. ఎవరైనా నీకు అపకారం చేస్తే క్షమించు. It is Good for me, .Good for me. అనుకో! ఎవరైనా తిడితే క్షమించు. ఈ దేహాన్ని ఆధారం చేసుకొని వాడు తిట్టాడు. దేహాన్ని తిట్టాడా? ఆత్మను తిట్టాడా? శంకరాచార్యులు వారు ఇదే విచారణ చేశాడు. ఆయన అద్వైతమంతా విచారణ.. విచారణ.. ఈ దేహాన్ని తిట్టాడా? ఈ దేహమును నేను, నేనే తిట్టుకుంటున్నాను. ఏమిటీ ఈ పాడు దేహం? ఏమిటీ ఈ అనిత్యమైన దేహము? **"ఇదంతా మలమూత్ర దుర్గంధ మాంస రక్తములే, పునుగు జవ్వాజీలు పుట్టబోవు"** నేను, నేనే ఈ దేహాన్ని తిట్టుకుంటున్నాను. వాడు ఈ దేహాన్ని తిట్టటం, నాకు ఉపకారమే అనుకో! ఒకవేళ ఆత్మను తిట్టాడా? వాడియందునూ, నీయందునూ వున్న ఆత్మ ఒక్కటే. కాబట్టి తననుతాను తిట్టుకున్నాడులే! అనుకో! 'క్షమ' అనే ఈ భావం ఎంత విశాలమైనది. ఈ విధమైన విశాల భావములను మనం పెంచుకుంటూపోవాలి.

విజ్ఞానవాణి - 5

## స్విచ్ వేయగానే బల్బు ఎందుకు వెలుగుతుంది?

విద్యుత్ బల్బ్‌కు కొంత వాటేజ్ ఉంటుంది. అంటే సెకనులో అది కొంత నిర్దిష్టమయిన విద్యుచ్ఛక్తిని తీసుకుని దాని ఫిలమెంట్‌లో ఉష్ణశక్తిగా మార్చగలదు.

ఏదైనా ఘనపదార్థాన్ని తగినంతగా బాగా వేడిచేస్తే అది వెలగడం మొదలుపెడుతుంది. అంటే దృశ్యకాంతి విడుదల చేయగల్గుతుంది.

వేడెక్కేటప్పుడు మొదట్లో ఎర్రగా వేడెక్కుతుంది. తరువాత పసుపురంగు, చివరకు తెలుపురంగుగాను వేడెక్కుతుంది. విద్యుత్ బల్బ్‌లో ఫిలమెంట్ ఈ దశలన్నింటిని క్షణికంలో పొందగల్గుతుంది. అందుకే స్విచ్ వేయగానే ఫిలమెంట్ తెల్లగా వేడెక్కినది మనకు కన్పించడం కాంతి విడుదల చేయడం గమనిస్తాం. ఎందుకంటే విద్యుత్ బల్బ్‌లోని ఫిలమెంట్‌కు తక్కువ ద్రవ్యరాశి ఉండడమే గాక, విశిష్టోష్ణం కూడా తక్కువగానే ఉంటుంది. దీనివల్ల ఫిలమెంట్ ఉష్ణోగ్రత వేడికి గబగబా పెరిగిపోతుంది. స్విచ్ తీసివేయగానే అంటే విద్యుత్ సరఫరా బల్బ్‌కు ఆపివేయగానే ఫిలమెంట్ చల్లారడం మొదలవుతుంది. వేడెక్కినంత వేగంగా చల్లారదు, మెల్లిగా వేడి పరిసరాలకు వెళ్లి చల్లబడుతుంది. అందుకే బల్బు ఆర్పివేసినప్పుడు ఫిలమెంటు లేత ఎరుపురంగులో కూడా కన్పించి ఆరిపోతుంది. - సి.వి. సర్వేశ్వరశర్మ

ప్రేమస్వరూపులారా!

ఈనాడు 'గురుపూర్ణిమ'. అజ్ఞానమును దూరం గావించుకోవాలి. ఎట్టి అజ్ఞానము? ఇది నాదేహము.... నాదేహము... అనేటటువంటి అజ్ఞానమును దూరం చేసుకోవాలి. ఈ దేహము అనేది కేవలం ఒక పనిముట్టు, కర్మకాలమైన కాయము. కాబట్టి దీనిని సత్యమని భావించ కూడదు. ఈ జగత్తులో కార్యమును ఆచరించే నిమిత్తమై, ఈ కాయమును నాకు భగవంతుడు అనుగ్రహించాడని భావించు. ఇది భగవంతుని యొక్క Gift శరీరము దేవాలయం, జీవుడు దేవుడు. కనుక ఏ దేహమును చూచినా, అది భగవంతుని మందిరమని భావించి, నమస్కారం చేయి. "సర్వజీవ నమస్కారం కేశవం ప్రతి గచ్ఛతి" మనం ఏ జీవికి నమస్కరించినా భగవంతునికే చెల్లుతుంది. "సర్వజీవ తిరస్కారం కేశవం ప్రతిగచ్ఛతి" ఏ జీవిని తిరస్కరించినా, భగవంతుని తిరస్కరించినట్లే అవుతుంది. కనుక మనం ఏకాత్మ భావాన్ని అభివృద్ధి పరచుకోవాలి.

మనం పవిత్రమైన భావాలు పెంచుకోవాలి. దైవత్వాన్ని మనం విశ్వసించాలి. ఎన్ని కష్టములు వచ్చినా భగవత్ విశ్వాసమును మాత్రం ఎన్నటికీ మరువకూడదు. ఆ విశ్వాసం ఒక్కటుంటే, మీకెంతైనా మేలు జరుగుతుంది. ఆ విశ్వాసమునే మనశ్వాసగా భావించాలి. కనుక ఈనాడు అజ్ఞానమనే దానిని నిర్మూలనం గావించుకొని, ప్రజ్ఞానమనే ప్రకాశమును వెలిగించుకొని, దివ్యత్వమనే ద్వైత్వంలో ఏకం కావాలి. అదియే ఈనాటి ప్రధానమైన స్వామి సందేశము.

(ది. 16-7-2000న గురుపూర్ణిమ సందర్భమున భగవాన్ సాయిప్రశాంతినిలయంలో చేసిన దివ్య సందేశము నుండి)

సుభాషితవాణి

# కార్యశూరులు

"అనారంభోహి కార్యాణాం
ప్రథమం బుద్ధి లక్షణం
ప్రారబ్ధ స్యాంతగమనం
ద్వితీయం బుద్ధి లక్షణం."

అసాధ్యమైన పని ఏదయినా అసలు మొదలు పెట్టకుండా ఉండటమే మంచిది. ఒకవేళ అలాంటి పని ప్రారంభిస్తే అది పూర్తిగా నెరవేరేదాకా గట్టిగా ప్రయత్నం చేయటం ఇంకా మంచిది.

ఏదైనా ఒక మంచి పనిని ప్రారంభించే ముందే, దాని మంచి చెడ్డలు, పూర్వాపరాలు ఆలోచించి మొదలు పెట్టటం విజ్ఞుల లక్షణం కాని, ఎవరు ఏది చెబితే తొందరపడి ఆపనిని ప్రారంభించడం ఏమాత్రం విజ్ఞత అనిపించుకోదు. ఒకవేళ ఏకార్యమునైనా ప్రారంభించిన, దాని లక్ష్యము.చేరుకునేంత వరకు విశ్రమించకూడదు, అది ఎంతటి కష్టమైన పని అయినప్పటికినీ, తమయొక్క శక్తి సామర్థ్యములచేత, ఆ పనిని సాధించి చివరకు విజయమును పొందుతారు. కార్యశూరులు అయితే ఇంకా కొంతమంది మాత్రం పనిని ప్రారంభించిననాటి నుంచి, అది జరుగుతుందా? లేదా? అన్న సంశయంతోనే ఆపనిని ప్రారంభిస్తారు. సంశయాలతో ప్రారంభింపబడిన కార్యం అసంపూర్తిగానే మిగిలి పోతుంది. అందుకనే 'సంశయాత్మా వినశ్యతి' అన్నది భగవద్గీత: అందువలన సంశయములతో కార్యమును ప్రారంభించడం కంటే, అసలు ప్రారంభించక పోవటమే మంచిదంటారు మన పెద్దలు.

"పట్టు పట్టరాదు పట్టిన విడువరాదు
పట్టినేని బిగియ బట్టవలయు
బట్టు విడుట కన్న బరగ జచ్చుట మేలు"
అన్నారు వేమన.

"పట్టిన దేదియో పట్టనే పట్టితివి, పట్టునెగ్గెడి దాక అట్టెయుండు" అన్నారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారు. కనుక తలపెట్టిన ఏ కార్యమునైనా సాధించేవరకు విశ్రమించరాదు.

అయితే కొంతమంది అధములు విఘ్నములు కలుగుననే భయంతో అసలు కార్యమునే ప్రారంభించరు. మధ్యములు కార్యమును ప్రారంభించి, విఘ్నములు కలిగినప్పుడు దానిని మధ్యలోనే విడిచిపెడుతారు. ధైర్యశీలాగుణ సంపన్నులు మాత్రం ప్రారంభించిన కార్యమును, ఎన్ని విఘ్నములు సంభవించినప్పటికినీ, ఏమాత్రం వెనుకంజ వేయక ఆ కార్యమును సాధించి తీరుతారు. ఇదే వాస్తవమును భర్తృహరి చక్కగా తెలియజెప్పాడు.

**"ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాస సంత్రస్తులై
యారంభించి పరిత్యజింతురు విఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్"**

**- సాయిప్రియ**

